SREE

# SRUNGARA

# CHANDRAHASEEAM.

A

TELUGU DRAMA IN FIVE ACTS.

BY


MADDULAPALLI GURUBRAHMAM,

Taluk Clerk. Narasaraopett,

Guntur District.



FIRST EDITION, 500.

COCANADA:

Printed at SCAPE & Co., New "Orient Jobber" Press.

1910.




[PRICE · RE. 0-8-0.

శ్రీరస్తు

శ్రీమజ్జగత్ప్రాణ తనయ వరప్రసాదలబ్ధ కవితా సంకలితుండగు

మద్దులపల్లి గురుబ్రహ్మశర్మ చే రచియింపబడిన

శ్రీ

# శృంగారచంద్రహాసీయము.



నాటకము.



నరసారావుపేట బోర్డు హైస్కూల్ సంస్కృతోపాధ్యాయులగు

బ్ర॥ కొండమూరి వేంకటరత్న శాస్త్రిగారిచేఁ బరిష్కరింపఁబడి

స్కేప్ అండ్ కో ముద్రాక్షరశాలయందు ముద్రింపించి

ప్రచురింపఁబడినది.

1910.



[PRICE: Rs. 0-8-0.

## ఈనాటకములోవచ్చు పాత్రలు.




సూత్రధారుఁడు.

మారిషుఁడు.

దుష్టబుద్ధి—(కుంతలుని మంత్రి.)

ఇరువురు జ్యోతిష్కులు.

బాలుఁడు.

తలవరులు—(శిశుఘాతుకుఁడు బాలపాలకుఁడు)

కుళిందుఁడు—కుంతలుని సామంతుఁడు.)

సేవకుఁడు—(కుళిందుని పరిచారకుఁడు.)

కిరాతులు—(వేటకాండ్రు.)

ఇరువురు బ్రాహ్మణులు—(బావ, మరది.)

కుంతలమహారాజు.

గాలవుఁడు—(కుళిందుని పురోహితుఁడు)

భట్రాజు—(చంద్రహాసుని యాచకుఁడు.)

చంద్రహాసుఁడు—(కుళిందుని పెంపుడుకొడుకు.)

మదనుఁడు—(దుష్టబుద్ధి కుమారుఁడు.)

విభాకరశాస్త్రి.

మురారిరావు.

ఇద్దరుసూనరులు—(దుష్టబుద్ధి నవుకర్లు.)

దండధరుఁడు—(దుష్టబుద్ధి వాకిటి కావలివాఁడు.)

### స్త్రీలు

విషయ—(దుష్టబుద్ధి కూతురు.)

చెలికత్తె—(విషయకు సహచారిణి.)

చంపకమాలిని—(కుంతలుని కుమార్తె.)



# అవతారిక

ఇదివరకు నేనువ్రాసిన కొండవీటిచరిత్రము (పద్యకావ్యము) 1907 సం॥ డిశంబరునెలలోఁ బ్రచురించినప్పుడు నామిత్రులు కొందఱు నన్నొక నాటకమును వ్రాయుమని ప్రోత్సాహపఱచి యీచంద్రహాసునికథనే నిర్ణయించి, యీకథయిదివరకు నాటకరూపముగ లేదనియును జెప్పినపైని నేనును వల్లెయని కథామూలము నరయ, నియ్యది పిల్లలమఱ్ఱి పినవీరభద్రకవికృత జైమినీభారతమునందుఁ గృష్ణుఁడర్జునునకుఁ జెప్పిన కథాభాగమునఁ గనుపట్టినది. మఱియు 1888 సం॥ ప్రాంతములయందు రాజకీయ పాఠశాలలలో బాలురకునియమింపఁబడిన "మూఁడవపాఠ పుస్తకమున" పిన్ననాఁడు చదివిన 56 పాఠమునందుగల యీకథ జ్ఞప్తికివచ్చి యీరెండుపొత్తములను సంపాదించి వీనిసహాయముచే నాటకోపయోగ కథాభాగముల నేర్పఱ్చుకొని 1908 సం॥ జూనునెలలో వ్రాయనారంభించి కొద్దిదినములకే ముగించితిని. ఇంతకుమున్నె యీకథ 1882 సం॥ ప్రాంతములందు మ॥ రా॥ రా॥ కే. కృష్ణారావుగారు (సబ్ జడ్జి) ఇంగ్లీషునను, 1908 సం॥న కాకినాడ వాస్తవ్యులగు మ॥ రా॥ మోచెర్ల హనుమంతరావుగారు తెనుఁగునను, నాటకములు వ్రాసినట్లు తెలియవచ్చి యారెంటిని చూచితిని. వీనియందు చంద్రహాసుని బాల్యవృత్తాంము సంక్షిప్తపఱుపఁబడినది. దీనియందు కొన్ని క్రొత్తరంగముల నేర్పఱచి కథకట్టుబాట్లయందును కొన్నిమార్పులుచేసి విద్యానాథ కవికృత ప్రతాపరుద్రీయ నాటకలక్షణానుసారముగ నానేర్చుకొలఁది వ్రాసి పంచసంధులును వానికివలయు ముఖ్యాంగములును విష్కంభాదులును నాయాస్థలంబులయం దుదహరించితిని. ఇయ్యది 1909 సం॥ ఏప్రిలు 13 వ తేదీని వినుకొండలో నచటి హిందూనాటక సంఘము వారిచే ప్రథమమునఁ బ్రదర్శింపఁబడినది. ఇందు చతుర్థాంకమునఁగల "రతినాథుడోకాఁడు" అను సీసపద్యము గణపవరపు వేంకట కవికృత ప్రబంధరాజ వేంకటేశ్వర విజయావిలాసమునఁగనుబట్టును. దానియందు నాకుగల గణ్యతచే దానిని రంగస్థలమునఁజదివిన వినవలయుననుసభిలాషవొడమి యట్టిదివేఱొక పద్యమును వ్రాసినను సారస్యమునందు సమత్వము వహింపఁజాలదను తలంపున నాపద్యమునే "గుర్తులతోనిందు వ్రాసితిని. ఈవిషయమునఁ గుకవులు నామీఁద చౌర్యారోపణముఁ జేయకుందురుగాక. నేనధికజ్ఞుఁడను గాకుండుటచేతను నాటకరచనయందు నాకిదియే

ప్రథమోద్యమ మగుటచేతను దీనగల దోషములను గుణగ్రహణ పారీణులగు చదువరులెల్లరును క్షమింప బ్రార్థితులు.

నర్సారావుపేట,
29-10-09.

ఇట్లు సుజనవిధేయుండు,
మద్దులపల్లి గురుబ్రహ్మం,
గ్రంథకర్త.

---

## యోగ్యతా పత్రిక.

మ॥ సరసంబైరుచిరార్థగౌరవవచ ♦ స్సందర్భశృంగార భా ।
సురశయ్యాదిక చిత్రవైఖరులచే ♦ శోభిల్లునీచంద్రికః ।
సరసాధీశుని నాటకంబు కవిరా ♦ జశ్రేణికిన్ మెచ్చఁగా ।
ల్వరసోదంచిత లీలవ్రాసెనుగురు ♦ బ్రహ్మాభిధానుండిలన్ ॥

నర్సారావుపేట,
15-7-1909.

ఇట్లు బుధజనవిధేయుడు,
శ్రీగిరిరాజు వీరభద్రయ్య.





శ్రీరస్తు.

శ్రీ

# శృంగార చంద్రహాసీయము.

## (నాటకము)

నాంది—ప్రస్తావన.



శ్రీయువతీమనోహరుఁడు ◆ శేషశయానుఁడు వారిజాక్షుఁ డా।
మ్నాయరహస్యవేది హృదు ◆ మంజులగీతకళావినోదిశౌ।
భాయితచంద్రహాసవర ◆ నాంచితు దవ్యయమూర్తి సర్వదా।
శ్రీయమొసంగిబ్రోవుత వి ◆ శేషకృపాపరిపూర్ణచిత్తుఁడై॥

§ చ॥ జలనిధిదాటిరాఘవుఁడో ◆ సంగినముద్రిక భక్తితోడ మై
థిలికిడిసంతసంబునఁద ◆ దీయశిరోమణిఁ దెచ్చి రామరా
ట్తిలకునకిచ్చి యెక్కుడగు ◆ దీవనలంగని మించు నాంజనే
యులుమన కెల్ల వైభవము ◆ లొప్పఁగఁ జేయుడిఁ జూఁపు గావుతన్.

(నాంద్యంతమున సూత్రధారుఁడు ప్రవేశించి తనలో)

సూత్ర—మదీయానుచరుండగు మారిషుం డింకను రాడయ్యె నేమి?

---

* 12 పదములుగల నాంది. § 22 పదములుగల నాంది. మారి—చిహ్నము.

మారి—(ప్రవేశించి) ఆర్యా! శిష్యున కేమియానతి?

సూత్ర—మన పూర్వ పుణ్యవిశేషంబున నారాయణాధివాసంబగు క్షీరసాగరం బిందు ప్రత్యక్షమగుచున్నది కంటివే.

(రంగప్రసాధనమను ప్రస్తావనాంగము.)

మారి—రసికజనమనోరంజకంబగు మృదుమధుర గానాతిశయముచేతను, విచిత్ర ప్రతిమా విరాజితంబులగు చిత్రపటంబులచేతను సాలంకృతంబగు నీరంగస్థలంబును, సప్తాంగలక్షణ లక్ష్యంబగు నీసభాస్థానంబునుం దక్క నాకొక్కటియుఁ గనుపించుటలేదు. తమకరుణ గల్గినచోఁ దానింజూడఁగలను.

సూత్ర—అట్లయిన వివరించెద.

చ॥ అనుపమ శాస్త్రవాదములె ♦ యబ్ధితరంగములై, తదీయని
స్వనమె నితాంత ఘోషమయి ♦ సత్కవిరాజులె దీవులై మహా
జనసుతమైనవిద్యయె ప్ర ♦ శస్తపయోత్కరమై, వివేకమే
ఘనతరశౌరిరూపమయి ♦ క్రాలెడు నీసభ క్షీరవార్ధినాఁ.

(ప్రపంచము.)

మారి—ఇప్పుడుగదా దేవరకృపచేఁ గనులారగాంచి కృతార్థుండనైతి.

సూత్ర—ఇది మిగుల రమణీయమగు సమయముగానున్నది. నీవిద్యావైశద్యము చూపగ నేదేనియొక్క ఋతువర్ణనముఁ జేసి సంతసింపఁ జేయుము.

(భారతీ వృత్తి సీసము.)

సీ॥ వనులచెంచెతలసే ♦ దను బాపనిల్పిన, పాన్పులనంగజోం ♦ పములుదనర
దివినుండి పుడమికై ♦ తెచ్చినసుధయన సరసులనిర్మల ♦ జలములను
నరకాంతలకుఁ దమ ♦ నడనేర్పవచ్చునఁ, చలనసితాభ్రముల్ ♦ చదలనలర
క్షితిఁ జూడవచ్చిన ♦ క్షీరసాగరమన దిశలెల్లధవళచం ♦ ద్రికలు గనర

తే॥గీ॥ పాపలనడంప గమకించి ♦ పవనమునకు
కార్ముకములని జంకి కే ♦ కలనుమాని
తమయభిమతంబు నెఱిసాత్వి ♦ కముననెమ్మి
గములు మెదలగ శారద ♦ గ్రాలుచుండె.

(అసత్ప్రలాపము)

సూత్ర—ఏమనీ ప్రశ్నించితివయ్యా? నీవు వర్ణించిన మాత్రనే యిప్పుడు నిశ్చయమగు శరచ్చంద్రికా గమనవిభ్రాంతి హాసము యీసభాసాగరం బుప్పొంగుచున్నది. నీనైపుణ్యమున నెఱదేని నవీననాటక ప్రదర్శనముఁ జేసి మిగుల సంతసింపఁజేయుట కర్తవ్యము.

మారి—అయ్యా నేనంతటివాఁడనా ?

చ॥ చదివెడు శాస్త్రములఁ ♦ జాలఁ దప్పులు గల్గఁ గల్గినన్
బదపడి యుక్తులల్లనిటు ♦ పాటిగఁ దెచ్చి హసింతు రింతెగా
కదయులు కొందరొప్పఁగని ♦ యాత్మలఁ గుందుగురంచు నాఁడు నే
మ్మదిఁ జెయియంగఁ జొచ్చె నది ♦ మాన్పినఁ జేకుఱు నెల్లకోరికల్,

(ఛలనము)

సూత్ర—ఎట్టి కార్యములకును సమర్థుండనని నీమిత్రులతో నాఁడు ప్రగల్భాలాపముల నిరర్థకపరుపక యించుక ధైర్యస్థైర్యముల నవలంబించినఁ గార్యనిర్వాహకుండవగుదువు. మఱియు,

(కథోద్ఘాతము.)

ఆ॥వె॥ పెద్దలైనవారు ♦ ప్రేమచేమనతప్పు
లనుక్షమించి కుకవు ♦ లనుశమించి
కరుణఁజూతురొప్పఁ ♦ గనియోరువనివారు
భువినిఁ జెడరె గుప్త ♦ బుద్ధులగుచు.

(ఆధిబలము.)

మారి—మీయనుగ్రహము సుంశినఁజాలు నాటకప్రదర్శన మనసెంత? తామిందులకు మొనదేలి నాటకనిర్దేశ మొనరించి సమయోచిత కృత్యంబులకు నన్నునియోగింపుడు.

(ప్రరోచనము.)

సూత్ర—మంచిది. సంగీత సాహిత్య సారపారీణులగు నీసభాసదులు మెచ్చ శృంగార చంద్రికాసీయమును ప్రదర్శింతము.

మారి—అందలి విషయములెవ్వి ?

సూత్ర—ఎఱుంగవా ?

(ప్రవర్తకము)

తే॥ గీ॥ సదయుడచ్యుతభక్తుఁడౌ ♦ చంద్రహాసు

(నాళిక)

గాంచియోర్వకజంపింపఁ ♦ బంచి సుతుని
మదనుఁగోల్పోయితానెదు ♦ ర్మరణమొంది
మరలజీవించుఁగొంతలు ♦ మంత్రియందు.

(వ్యాహారము.)

మారి—మదనుని గోల్పొచ్చినది రుద్రుండుగదా?

సూత్ర—ఏమి యిదినీ బుద్ధిప్రమాదమా? లేక పరిహాసమా?

తే॥ గీ॥ ఈచరిత్రఁగొండిన్యము ♦ నీంద్రగోత్ర
భవుఁడుమద్దులపలిగురు ♦ బ్రహ్మశర్మ
నాటకముగరచించుట ♦ నవ్యముగను
మనముపఠనమొనర్చుట ♦ మరచినావె?

(అవస్యందితము)

మారి--ఇస్సీ! మదనుడనఁగా విష్ణుసుతుండగు మన్మథునిగా నెంచితిని. తమకృపచే నిప్పటికి స్మృహకువచ్చినది. ఇదియెల్లరకు సంతసనీయము. కాని యిది కేవల నవీనమగుటచే రంగస్థలమున రక్తికట్టింపగలమో? లేమో? యను సందియముదవివె.

(మృదవము.)

సూత్ర—ఇది నవీనమగుటచేత నే రసభంగమగునేమోయను భీతిచే పాత్రలన్నియూ మిగుల భయభక్తులతో నటించి రసపోషణ గావించును.

(తెరలో జ్యోతిష్కులు) సహాధ్యాయులారా! ఇదియే మంచిసమయము. ఇంచుకతడవయ్యెనేని మంత్రివల్లభుండు రాజసభకరుగునట త్వరలో బారికడకేగి దర్శింతమురండు.

(ప్రయోగాతిశయము.)

సూత్ర—మిత్రమా యిదేవినుము. మనమిట్లు ముచ్చటించుచుండ నే ప్రథమరంగము తీరినట్లున్నది. తక్షణంబజని తక్కటి విషయంబులైన చక్కపరుపుము.

(గండము.)

మారి—ఇదె చనుదెంచి సర్వంబును సిద్ధపరచెదను.

(అని యిరువురును నిష్క్రమింతురు.)



శ్రీ

# శృంగార చంద్రహాసీయము.

## ప్రథమాంకము.

### ప్రథమరంగము.

(దుష్టబుద్ధియు జ్యోతిష్కులును ప్రవేశింతురు)

దుష్ట — ఎంతమూఢులైనను యిట్లుతలంతురా? బుద్ధిబలిమికి సాటియగునది వేరొం డేమి గలదు?

(ఉపక్షేపము)

చ॥ నిరుపమసౌఖ్యముల్ బడయ, ♦ నిస్తులమౌ విభవంబులొంద, భూ
వరపదముల్ గ్రహింపఁదన ♦ వైరులనెల్లనడంప, నేర్పుతో
తప్పులనెల్లఁ దీర్చికొన ♦ గాఁదగుమార్గము మానవాళి క
త్యుత్తరమైనబుద్ధిబల ♦ మొక్కటెసుమ్ము జగంబులోపలన్.

(పరిన్యాసము)

తే॥ గీ॥ రాజునకు మారు రాజునై ♦ రాచరికముఁ
బరపుచునుగల్గు సకలసం ♦ పదలనెల్ల
ననుభవింపుచునున్నాఁడ ♦ నస్మదీయ
బుద్ధిబలమునఁగద యిట్లు ♦ పొసఁగునెల్ల.

(భేదము)

కావున నెల్లవిషయంబులకును సఫలకారియగు బుద్ధి బలిమే బలిమి. బుద్ధి బలిమే కలిమి. నాప్రజ్ఞాతిశయంబున నమోఘంబగు బుద్ధి బలిమి వడయుటం బట్టిగదా నాకిట్టివైభవంబు చేకూరె. ఇంతకు ప్రాముఖ్యము బుద్ధిబలమే కావున దానిం గూర్చి మీయభిప్రాయము నింతియె కదా?

జ్యో—మంత్రివర్యా ! తామిట్లుశలవీయఁ బ్రతివచనంబులుబల్కు మే మెంతటివా రము ? అయినను యెట్టివిషయంబులకును ముఖ్య కారణము దైవబలము కాని బుద్ధిబలము కాదని మాయభిప్రాయము.

మఱియు. శ్లో॥ “ అన్యధా చింతితం కార్యం దైవమన్యత్రచింతయేత్ .”

అని పెద్దలు నుడువురీతిని కార్యంబును మనోభీష్టంబును నేకీభవించినప్పుడు తప్పఁ దక్కినవేళలందెల్ల దైవికంబున మనమొకటిదలంప నదియొకటియగును కావున బుద్ధిబలం బప్రయోజనంబని మనవిసేయ సాహసించుచున్నారము.

దుష్ట—అట్లేల చెప్పనెప్ప?

(పరికరము)

తే॥ గీ॥ బుద్ధిబలమునఁగా దెభూ ♦ ములను గెల్చి
పాలనంబొనరించుచుఁ ♦ బార్థివుండు
నిహపరసుఖంబులను గాంచు ♦ నెల్లనింక
దైవికంబంటు మీప్రమా ♦ దంబ కాదె.

(యుక్తి)

“ ప్రమాదోధీమతామపి ” అన్నట్లు మీరుతెలిసిన పెద్దలైన నీయల్ప విషయంబునఁ బ్రమాద మొందుచున్నారు.

జ్యో—అట్లెలబల్కెదరు ? ఎల్లవిషయంబులకు ప్రాప్తికారణంబగు దైవబలంబుండ మానుషికంబై యస్వాతంత్ర్యంబగు బుద్ధిబలంబెక్కుడని యెట్లుచెప్పగలము ! దైవికంబను శబ్దంబెఱచి గ్రుమ్మరి యిమ్మహిని జేసినవారెందరుందురు గలరో చూడుడు.

సీ॥ పురిటింటఁబసిబిడ్డఁ ♦ బరిమార్ప నెంచిన కంసు యోజనలుభం ♦ గములుగావె
లక్కయిల్వన్నిపాం ♦ డవులఁద్రుంపగఁ జూచుకురుపతియూహలు ♦ క్రుంగిపోవె
ఆంజనేయునిఁజంప ♦ నరసిన కాలనేమి మహాపకృతులువ్య ♦ ర్థములుకావె
పాంచాలిఁజెఱుపఁ బా ♦ ల్పడ్డకీచకు నుపాయములన్నియనువిక ♦ లములుకావె

తే॥ గీ॥ వారుబుద్ధిబలాఢ్యులు ♦ గారెతలఁప
దైవికంబుననవియెల్ల ♦ దప్పిపోవె
కానమన మొనరించెడు ♦ కార్యములకు
బుద్ధిబల మెకారణమనఁ ♦ బొసఁగు టెట్లు.

(ప్రాప్తి)

దుష్ట—అకటా! పాపము. మీబుద్ధిప్రవాద మంతకంత కతిశయిల్లుచున్నది. మీరు పౌరాణిక వాక్యములనే గ్రహించితిరిగాని వానియందుగల యథార్థ్యముల గ్రహింపలేరైతిరి కదా! నేను జెప్పినవిదివరైన గ్రహింపఁగలరేమో చూత్తము.

(సమాధానము)

సీ॥ మాయచేబిడ్డను ♦ మార్చుటఁగానమిఁగంసు యోజనలు భం ♦ గంబులయ్యె
లక్కయిల్లార్చెడు ♦ టక్కుభీము డెఱుంగఁ ♦ గురుపతియాహాలు ♦ గ్రుంగిపోయె
ఆంజనేయులుజలం ♦ బానకుండుటఁగాల నేమియత్నంబుల ♦ స్నానము దొలఁగె
పాంచాలిచెప్పిన ♦ పట్టునకేగుటఁ గీచకుకృత్యముల్ ♦ వెడసిపోయె
తే॥ గీ॥ వారుబుద్ధిబలాఢ్యులు ♦ గారకుంచు
నెఱుగలేకుందు రేమిర ♦ యింకనైన
బుద్ధిబలముప్రయోగింపఁ ♦ బొసఁగరాని
కార్యమొకటైనఁగలదె జ ♦ గంబునందు.

(ఉద్భేదము)

కావున మీవచనంబులు నామదికి రుచింపకున్నవి. బుద్ధిబలిమే యెల్లవిషయంబులకు నెక్కుడని వేనోళ్ళనుడువనుత్తును.

జ్యో—మంత్రిసత్తమా! తాముని క్కముగా బుద్ధిబలాఢ్యులే కాన మావచనంబులకు యుక్తియుక్తంబులగు ప్రతివచనంబులు బల్కితిరి. కాని యెందుచూచి నను దైవబలమే ప్రాముఖ్యమని మాయభిప్రాయము. మీకు సమాధానంబులీయ మేమెంతటివారము?

తెరలోనుండి జ్యోతిష్కుల పైప్రనకు బంతి పడును.)

బాలు—(తెరలో) బాలులారా నాబంతి వారికడఁబడియె నేను వానిని తేకితెచ్చు కొనియెద (అని ప్రవేశించును.)

(మంత్రితో) అయ్యా ఆటలపాటున నాబంతి యిటువచ్చిపడియె దానినొసంగుదురే

దుష్ట—బాలకా. వారికడకుఁబోయియడిగి తీసికొనుము. (జ్యోతిష్కులఁజూపును)

బాలు—(జ్యోతిష్కుల నడిగి తీసికొనిపోవును.)

జ్యో—అమాత్యచూడామణీ! అసమాన విలాసభాసమానుండగు నీబాలుండెవ్వఁడు? వీని ముఖవిలాసముచూడఁజూడ మామనంబులకు ఘనంబులగు నూహలు గల్గుచున్నవి.

దుష్ట—వీఁడు మనపురమునఁగల యొకానొక దాసికొమారుండు మనబాలురతో జెలిమినే యాడుచుండెడివాఁడు.

జ్యో—అయ్యా వీడొక దాసీకుమారుఁడు కాడు. రాచకొమరునివలెఁ గనుపట్టుచున్నవాఁడు. వీనింజూచుతోడనే యెన్నఁడో చిన్ననాఁడు నేర్చిన సాముద్రికశాస్త్రమునఁగల రాజలక్షణంబులెల్ల జ్ఞప్తికి వచ్చుచున్నవి. యెట్లనిన

(దూరమున నిలుచుండిన బాలకుని జూపుచు)

తే॥ గీ॥ హలకులిశ పంకజాంకము ♦ లవియెకనుఁడు
అతిశయంబగు భుజయుగో ♦ న్నతినిఁగనుఁడు
డంబుతగిన విశాలవ ♦ క్షంబుగనుఁడు
లలితనృపచిహ్నలెన్నియో ♦ గలవు గనుడు.

ఉ॥ వీనిముఖంబునందు నృప ♦ వీరునకుంగల చిన్నెలెన్నియో
కానగనయ్యెదాసకుడు ♦ గాడు మహీతలమెల్లఁజల్లగా
బూనిభరింపఁజాలునృప ♦ పుంగవుఁడై విలసిల్లునట్లుమా
మానసమందుఁదోఁచెను స ♦ మంచితలీల నమాత్యకాంచితే.

దుష్ట—ఓహో! యిది రెండవప్రమాదము కాఁబోలు.

జ్యో—అయ్యా తాము వేరుగాఁ దలంపకుడు వీడు నిశ్చయముగా క్షత్రియకుమారుఁడే వీనివృత్తాంతము సాంతముగాఁజెప్పఁగలము.

దుష్ట—ఏదీ! వినెదము.

జ్యో—(కొంతయోచించి) అయ్యో! పాపము. ఎంతటిదురవస్థగల్గె. ఇతఁడనంతకల్యాణగుణ గరిష్ఠుండు నిజమస్తకవిన్యస్త హస్తకమలధరానాథ సంస్తూయమాన మహైశ్వర్య విరాజమానుండును అవక్రవిక్రమాక్రమిత ధరాచక్రుండును నగు కేరళ మహీపాలుని పుత్రుండు. ఈతని జనన కాల నక్షత్రదోషంబున జనకుఁడు రణనిహతుఁడయ్యె. పిదపఁ తల్లియు సహగమనయయ్యె. అంతనీపట్టి యనాథుండై యుండ. దాసీజనంబులు పెంచుచు వారును గతిం

చిరి. తుదకు దిక్కులేక యీయూరుజేర జనులిచ్చినన్న వస్త్రములచే బ్ర
దుకుచున్నవాడు. వీనుహరిప్రసాద సమాసాదిత ధీవిశాలుండు. కతిప
యదివసంబులకు చక్రవర్తిత్వము వహించునట్లును ఒకవేళ మన సింహాసనాధి
పతియే యగునట్లును తోచుచున్నది. ఇదియంతయు శాస్త్రసమ్మతము.

దుష్ట—మీరు నేర్చినవిద్య గొప్పదైనను యోజనావిషయమున పొరబడితిరనియే చె
ప్పగలను. ఎట్లనిన. ఈపురమున చిన్ననాటనుండి మాబాలురతో నాడుకొను
చు తిరుగుచుండెడు నీదాసికుమారుని క్షత్రియకుమారుడనుటయు చక్రవర్తి
త్వము బడయుననుటయు మిగుల రమణీయములు. ఇంతకు వచ్చినకార్యము
చెప్పరైతిరి.

జ్యో—ఏమియులేదు.

చ॥ నిరతముగొప్పవారలగ ♦ ణించుచుఁ దప్పకనిత్యదర్శనం
బరసియొనర్చువారిదె స ♦ మంచితభాగ్యము కాదె కానమే
మొరలఁద్వదీయదర్శన మ ♦ దొక్కటె కార్యముగాఁగఁబూని యీ
కరణినివచ్చినారమిటఁ ♦ గల్గెను గల్గుచున్నమన్ననల్.

ఊరకదర్శనార్థమై వచ్చితిమి సెలవిచ్చిన చనుదెంతుము.

దుష్ట—మంచిది.

జ్యోతి—"వినాశకాలే విపరీతబుద్ధిః" అనుకొనుచుపోవుట.

దుష్ట—స్వగతము.

తే॥ గీ॥ నలినభవువ్రాలు రాము బా ♦ ణమును విష్ణు ।
చక్రము శతారమునుయు ధి ♦ ష్ఠిరునికోప ।
మంగజుని కేళిదేళి భు ♦ జంగి కాటు ।
కోవిదోక్తియు వ్యర్థముల్ ♦ గావటండ్రు॥

(కరణము)

కావున వీరిని కేవలఛాందసులని పలుమారు నిరసించితిని అదిసరికాదు. వీరు వి
ద్వాంసులు వీరు నేర్చినవిద్య త్రికాలవృత్తాంతములు తెలియఁదగినది. వీరు చె
ప్పెడు వాక్యములు వ్యర్థములుకాకపోవచ్చును. అయినను వీరుపలుకులె
ల్ల నిక్కంబులయినచో జగంబులు భరింపగలవే వీరు చెప్పినప్పటినుండి యు
నాకును క్షత్రియకుమారునివలెనే యనుమానముగలిగినది. అట్లయిన నాకిదివః

కే యేలతోఁపకుండవలయు ? ఇంతయేల మనబాలురతో నాడుకొనుచుండెడి వాఁడేకదా ? వానిసంగతులు మనయింట దెలియవా ? ఇంటిలో రహస్యముగా విచారించి వచ్చెదను. (అని చనుట)

(బిందువు) (ముఖసంధిసమాప్తి)

దుష్ట—తిరిగి యింటికి ప్రవేసించి (తనలో) ఆహా ! యేమి చిత్రము ? జ్యోతిష్కులు చెప్పినట్లు దాసికుమారుడు కాడనుటయే నిశ్చయముగానున్నది. గతవర్తమానములన్నియు యథార్థములే యయియుండును. ఇక భవిష్యద్వర్తమానములుమాత్రమేల వ్యర్థంబులగును. కావు. వీఁడు నిశ్చయముగా క్షత్రియుఁడే రాజ్యపదవి నొందువాఁడె. అట్టివాఁడీ సింహాసనాధిపతి యేల కానేరడు ? యింతయేల యెంతకాలము నుండియో నేనెంచియున్న మనోరథము విఫలంబగు కాలమాసన్నమగుచున్నది.

(విలాసము.)

అకటా ! అట్టియెడ నాబుద్ధిబలమేమి కావలయు ? కానిమ్ము. బుద్ధివిశేషంబున నింత రాజ్యపాలనమె నడపుచుండెడు నాకింతటి యల్పకార్యమునకే సామర్థ్యము బ్బదా ! మనరాజు ఏకపుత్రికావంతుండుగదా నాకుమారునకు రాజకుమారినొసంగి పరిణయము గావించి రాజ్యమునకు నాకొమరుని పట్టభద్రుని సేయనెంచితిని. ఇట్టి మంగళకార్యమే వ్యర్థంబగునా ? ఇదివరకెప్పుడును నాపట్టినపట్టు వట్టిపోలేదు. దీనికేదేని పన్నవలయు (అని యోచించి) గోటజీరుదాని నుపేక్షించిన గొడ్డటనైనఁజిమ్మలేమనునట్లు నేడేమాత్రమును నిలకడసేయరాదు.

ఆ॥ వె॥ తోఁచెనొక్కయుపము మ ♦ దోస్సాహసులగు ।
తలవరులనుబిల్చి ♦ తత్క్షణంబ ।
బాలునడవిలోనఁ ♦ బరిమార్చిరండని ।
యనుచుటొప్పఁ ♦ గడరహస్యముగను ॥

అట్టి రహస్యకృత్యము నెవరును వినరాదు. నేనే స్వయముగా చెప్పి నియోగింపవలయు. (అని చనుట.)

ద్వితీయరంగము.

అడవిలో శిశుఘాతుకుడును బాలపాలకుడును ననుతలవరులు బాలునిచేతులను గట్టికొని కేకలువేయుచు ప్రవేశించుట.

బాలుడు—అయ్యా మీరెవరు? ఆడుకొనుచున్న నన్నేల నిర్నిమిత్తముగాఁ బట్టి తెచ్చుచున్నారు. నేనేమితప్పుజేసితిని. (అనివగచుచు)

క॥ అయ్యా యేమెఱుఁగనినను ।
గుయ్యాడఁ జేతులనుగట్టి ♦ కొని నిర్దయులై ।
యెయ్యెడలకుఁ గొంపోయెద ।
రయ్యా విడిపించి బ్రోవ ♦ రయ్యా కరుణన్ ॥

అయ్యా పుణ్యాత్ములారా. నాకాకలియగుచున్నది. నాకింత బువ్వ పెట్టించెదరా? మీరుచెప్పినట్లు వచ్చెదను. నన్నేల దండించెదరు?

శిశు—ఛీ! దురాత్మా నోరెత్తక యూరకరమ్ము. ఈకత్తిచే నఱికెదను.

బాలుడు—(తనలో) అకటా! వీరునాకేమో ప్రాణాపాయము సేయఁదలచినట్లున్నది. లేకున్న యీకరకుకత్తుల బెదరించనేల. దురాత్ములారా మీరు నన్నేమోచేయఁదలంచి యీయడవులలో నడిపించుకొని పోవుచున్నారు. అమ్మతో చెప్పి కొట్టించెదను. నేనురాను (అని కూర్చునుట) (తిరిగి ఈడ్చుకొని పోవుట.)

అయ్యా నేనేమిచేసితిని నన్నేలబాధించెదరు. నాకిచట దిక్కెవరు? (బిగ్గరగా) అబ్బానడువఁజాల (అనిజాలితో)

### కీర్తన. పీలు రాగము—ఆదితాళము.

నడువఁజాల । నడవిలోన । బడలితినయ్యా । ॥నడువ॥
బుడతనయ్యా । విడువరయ్యా । అడలితినయ్యా । ॥నడువ॥
తల్లిదండ్రి లేనివాడ । దయజూడరయ్యా ॥నడువ॥

బాలపాలకుడు—ఓరి? అన్నా యీకసిగండు ఇట్లువిలపించుచుండ కారడవుల నడిపించుచు కష్టపెట్టుటయేకాక నిష్కారణముగా నేల దండించెదవు? నీకేలదయరాదు? మనకును నిట్టిబాలురు లేరా? యిట్టిసుందరమూర్తినిఁ జూచినంతటనైన నీమనసు కరుగలేదా!

శిశు—ఛీ! మూర్ఖా నీవు పట్టిపిరికివాడవు. అసమర్థుండవు. చేతగాకుండిన నోరు మూసికొని యూరకుండుము. నాకత్తికిటీవల నేమియు నాహారము దొరకదయ్యె. మనమంత్రిగారి దయచే నేడువీడుదొరకెనని మిక్కిలి సంతసించుచున్నాడను. చూడుము నాప్రజ్ఞ (అని కత్తిఝుళిపించుట)

బాలపాలకుఁడు—శివ! శివా! నేనేమిసేయఁజాలకున్నాను.

బాలుఁడు—(బాలపాలకునిజూచి మొక్కుచు) అయ్యా నీవైనాచెప్పివిడిపింపరాదా?

సీ॥ పుట్టినప్పటినుండి ♦ పోషించుటకు నాకు తలిదండ్రులెవ్వరో ♦ తెలియనయ్య!
దైవమొక్కఁడె నాకు ♦ తలిదండ్రియనిమది నురుభక్తిచేనమ్మి ♦ యుంటినయ్య।
పురజనంబులునెట్టు ♦ బువ్వచేదినదినం బూపిరిసల్పుకొం ♦ చుంటినయ్య।
ఆటపాటలనైన ♦ నపరాధమొకఁడేని యేవేళలనుజేసి ♦ యెఱుఁగనయ్య॥

తే॥ గీ॥ ఇట్లు నను బాధ బెట్టంగ ♦ నేలనయ్య।
ఉల్లమునఁ గడుభయమగు ♦ చున్నదయ్య।
ననువజాలకసాక్షియు ♦ న్నాఁడనయ్య।
కరుణతోనను విడిపించి ♦ కావరయ్య॥

శిఖి—ఛీ! వాగకుము. నరికెదను.

బాలుఁడు—హా! పరమేశా, నాప్రాణములు తీయున్నట్లున్నది.

ఉ॥ క్రూరులు దుర్గమాటవుల ♦ కుంగొని పోవుచునున్నవారలే।
నేరమెఱుంగకుంటిని వ ♦ నీస్థలిలోపల నేమిసేయను।
న్నారొకో యిట్టివేళనికఁ ♦ నన్నుఁగృపన్ విడిపించిబ్రోవగా।
నేరును లేరుగాదె జగ ♦ దీశ్వరుఁడొక్కఁడు దక్కనక్కటా॥

శిఖి—ఇకసహించను. చూడుము. ఇదే ఖండించెదను (అని కత్తియెత్తబోవుట)

(విఘాతము)

బాలపాలకుఁడు—అన్నయ్యా ఎంతటిసాహసుఁడవు? నీపౌరుషంబెల్ల యీకుఱ్ఱనిపై నే చూపవలయునా! ఇదియేమంచిఘనము. డేగచేచిక్కిన పిచ్చుకవలె పదవడ వడంకుచు పరిపరివిధంబుల విలపించుచు బ్రతిమాలి మొరపెట్టుచున్నాఁడు. వీనిమొర వినినమీదనైన గనికరమురాదా? ఈముద్దుబాలుని పట్టియాడువ నీచేయెటులాడె నీకును ఇట్టిపిల్లవాండ్రు కలరుగదా. వారలలో నొక్కనిగా భావింపవలదా? చాలుచాలు. విడువుము విడువుము. వీనినిజూడఁ గేవలసామాన్య బాలకుఁడుగాక మహానీయుఁడగు భక్తుఁడుగాఁగనుపించుచున్నాఁడు. వీనినిముట్టిన పాతకమంటును.

శిశు—ఓరీ! రాజద్రోహి! నీముఖము చూడరాదు. మనయజమానుని ఆజ్ఞ మీఱఁదగునా? నీవెంతటిపనికైన సాహసుఁడవే రమ్ము నీవనిపట్టెదను. నీనిపై నీకేమైన మోమాటముకలదేమో నాకులేదు.

బాలపాలకుడు—నీయిచ్ఛవచ్చినట్లు చేయుము.

శిశు—ఇచ్చటికి చాలాదూరము వచ్చితి. ఇక్కడ మనకార్యము నెరవేర్చుకొనవచ్చును. (అని కత్తితీసి కూర్చుండఁబోవుట)

బాలుడు—అయ్యో నిరపరాధినగు నన్నేలనిర్నిమిత్తముగా చంపెదరు! ఆక్కటా పరమేశ్వరా! నీవే నాదిక్కు. రక్షింపుము. రక్షింపుము.

తే॥ గీ॥ అయ్యయో నన్నుఁదెచ్చిరా ♦ యడవిలోన ।
బట్టి కుత్తుకఁగోయఁ ♦ బాల్పడిరివీరు ।
కరుణచే నడ్డమైవచ్చి ♦ కాఁచుదిక్కు ।
లేను వీరికిజాలియు ♦ లేను కాదె॥

కీర్తన. తోడిరాగము-ఆదిరూపకము.

ఓదయాకరా ఓ ♦ హేపరాత్పరా ॥
నాదుమొరాలకించి ♦ నన్నుబ్రోవరా ॥ ఓదయా॥
ఈదురాత్ములున ♦ న్నీడ్చుచుండిరి ।
ఏదిత్రోవబ్రోచువార ♦ లెవరులేరురా ॥ ఓదయా॥

సీ॥ వీరుపెట్టెడుబాధల్ ♦ విడిపించిబ్రోవరే కీర్తనీయులగు త్రిమూర్తులార ।
ఈపాపకర్ముల ♦ యెదలలోదయజనిం ♦ చఁగఁజేయరే సూర్యచంద్రులార ।
హత్యమొనర్చుటఁ గూడ ♦ దనిమీరలైనఁజెప్పఁగరాదె యష్టది ♦ క్పాలులార ।
తప్పేయుంగనివీని ♦ దండింపవలదని ♦ యడ్డంబురారె మృ ♦ గాళులార॥

తే॥ గీ॥ పుణ్యమగుమీరుఁగావరె ♦ భుజగులార ।
గుహాలననుదాచుకొనరెయో ♦ కుధరులార ।
ఆకటననుఁజంపుచుండ మీ ♦ అందరిపుడు ।
కాంచుచుండుట ధర్మంబె ♦ కరుణమాలి॥

అయ్యో! పుణ్యులారా. నన్ను దయచేసి విడిపింపుఁడు. నన్నుఁజంపిన మీకేమి లాభము! బ్రతికియుంటినేని మీఋణము దీర్చికొనెదను. (అని మ్రొక్కుట)

శిశు—(పెద్దగా) ఛీ ఛండాలా! వదేవదేవాగెదవు. నోరెత్తకుము.

బాలుఁడు—వీరు నన్ను చంపుటకన్న నన్నేమి చేయఁగలరు! నిష్ఠురముగా నొక్కసారి యాశీగదను.

ఆ॥ వె॥ ఓఁబురాత్ముఁలార ♦ యొక్కింతయైనను
న్యాయమెదలమీకు ♦ నాటదయ్య
నిట్టిదోసమేలఁ ♦ గట్టికొనెదరు మీ
దుష్టబుద్ధివిడిచి ♦ తొలఁగరయ్య॥

శిశుఘా—ఆశ్చర్యముతో! తమ్ముఁడా? యిదేమిచిత్రము. వీనిక్రమనలను బంపినది గుష్టబుద్ధియని యెట్లు తెలిసె. నీవుచెప్పినట్లు వీఁడొకసామాన్యబాలునివలె నుండలేదు. వీనిఁజంపనాకును జేయ్యాడకున్నది. మంత్రిగారిబాలుని జంపిరమ్మన్న మనలనేచంపించెదనని చెప్పిపంపెనుగదా. వీఁడునుమనమును బ్రదుకనుపాయము పన్నుము.

బాలపాలుఁడు—అదియెంత! మంత్రిగారు వీనినిజంపి యేదేని దేహచిహ్నమును తెచ్చి చూపుమని పనిచెఁగదా. దానికి వీని కాలియందుఁగల యాఱవ వ్రేలిని గోసి తీసికొనిపోయి చూపెదము. అతఁడు తృప్తిపడఁగలఁడు.

శిశు—మంచిది. నీవుచెప్పినదే మంచియుపాయము అట్లే వేలుకోసెదము.

తల॥ ఇద్దఱు—బాలకా నిన్ను చంపుటకై యింగుతెచ్చితిమి. నీవుమొఱపెట్టుట చూచి దయదలఁచితిమి. మాయజమాను నాజ్ఞనెరవేర్చుకొనుటకు నీ కాలివ్రేలిని కోసి తీసికొనిపోయెదము. ఏదీ కాలిమ్ము.

బాలు—అయ్యలారా! నేనేమిచేసితిని? మీయజమానుఁడు నాకింతటి శిక్ష యేలని యమించె.

ద్విపద॥ అయ్యయ్యొ యిదియెంత ♦ యన్యాయమయ్య
కుఱ్ఱఁడవ్రేలేల ♦ గోసెదరయ్య
పెఱిగిన బాధచేఁ ♦ దాళలేనయ్య
కరుణించినన్నిందుఁ ♦ గాపాడరయ్య
ఈయడవులను నా ♦ కెవరుదిక్కయ్య
పాయకననుజంపి ♦ పదవేయరయ్య॥

నావ్రేలుకోసిన బాధపడుటకన్న మృతియే మేలుగాన నన్నుగడపి మీయజమాని యాజ్ఞ నెరవేర్చుకొనుఁడు.

శల—మనము వీనితో మాటలాడుచుఁ గాలముగడపరాదు. మనమసి దీర్చుకొని పోదము. (అని వేలుకోసికొని పోవుట)(అపరిదర్శనీయము)

బాలు—హా ! పరమేశ్వరా ! (అని మూర్ఛిల్లుట.) కొంతవడికిఁ దెలిసి లేచి.

అక్కటా! యెట్టిబెట్టిదములు చేసూరె. నేనెంతటిపాపిని ? నన్ను నట్టిబకుత్రుల పాలుజేసి వ్రేలుకోసికొని పోయిరిగదా ! ఈబాధ కెట్లోర్తును. లోకేశ్వరా ! నీకైన నేలదయారాదయ్యె.

తోడిరాగము–ఆటతాళము.

లోకేశ నను బ్రోవ ♦ నీకైనదయారాదె
యీకోతబాధచే నే ♦ టులోర్తురా తండ్రీ॥ లోకేశ ॥
ఈపాతకులు నన్ను ♦ నిట్లు బాధించిరి
కాపాడరారయో ♦ శ్రీ పరమేశ్వరా॥ లోకేశ ॥

నాకెవరు దిక్కు ! నా తలిదండ్రులుంచిన నాకిట్టిపాట్లు వాటిల్లదుగదా ! తల్లినీవుంచిన నా పాటు వినిభరింపఁగలవే. నన్ను మీరొక బంగారుకొండవలె మురిపెములతోఁ గని భూమిపైఁబడవేసి పోతిరిగదా నాకెవరిని దిక్కు చేసితిరి. నా మొరవిను వారెవరు ? మీ ఋణముతైన దీర్చుకొనలేనైతినిగదా. ఎంతటి దురాత్ముఁడను. కాకున్న నాకేల యిట్టియిక్కట్లు కలుగును. హా ! పరమేశ్వరా! నీవే నా దిక్కు. వనమృగములారా! మీరే నా సహచరులు. నా బాధమామపఁడు. నాదేహము సొక్కుచున్నది. నిలువఁజాల (అని పడిపోయి కొంతవడికిలేచి)

సీ॥ ధరను నేలేకున్నఁ ♦ దరుగైనయట్లుగాఁ దెంపరిబ్రహ్మాపు ♦ ట్టింపనేల।
పుట్టించినాఁడెపో ♦ గిట్టనీయక దాదులంచితంబుగ బ్రతి ♦ కించనేల।
బ్రతికించినారెపో ♦ హితులతోనాడు నన్నిచ్చోటికిని వీరు ♦ తెచ్చుటేల।
తెచ్చిరేపో నన్నుఁ ♦ దెగటార్పకను గాలి వ్రేల్గోసియీరీతి ♦ విడువనేల॥

తే॥ గీ॥ విడిపోయిరె పోయిట్టి ♦ యడవిలోన
నేటితో నాదు బాధల ♦ న్నియునుదీఱ
మిక్కుటంబగు దయామది ♦ పిక్కటిల్ల
నిట్టిమృగమొక్కటైనఁ జా ♦ పంగరాదె॥

# శ్రీ శృంగారచంద్రహాసీయము.

వసుధావృత్తము.

శరణాగతసం ♦ తరణాగనవే,
కరుణాకరనా ♦ మొఱలాలినవే
కడుఁబాతకులీ ♦ చెడుకానలలోఁ
గడవ్రేలిని నిక్కడఁ ♦ గోసిరయో॥

అక్కటా! నేనిబాధకోర్వఁజాలకున్నాఁడ. నానాలుక యెండుచున్నది. నాకింత నీరైన నిచ్చువారు లేరైరిగదా! ఈదురాత్ముల హృదయము లెంత కఠినములు కటికవాని మనసైనఁ గరఁగును గాని వీరిచిత్తము మెత్తగిల్లదుగదా. ఎవ్వరును గానరారైరి. కానవచ్చి యీసారి మఱియొకవేలు కోసెదివారు దొరకుదురు. పుణ్యులు పుడమిపైఁగలరే. నాప్రాణములు సొమ్మసిల్లుచున్నవి (అని మూర్ఛపోవుట)





శ్రీ

# శృంగార చంద్రహాసీయము.

## ద్వితీయాంకము.

### ప్రథమరంగము.

(అడవిలో కుళిందుఁడు సేవకుడు కిరాతులు ప్రవేశము)

కుళిందుడు—

పంచచామరము॥ బిరాన సింహ రాజమిట్లు ♦ వేరె మెత్తెఁ జూడుఁడీ
శరాననేల రాలదానిఁ ♦ జంపవేటలాడుఁడీ

కిరాతులు—
పరాకు దేవరా సలాము ♦ పాతిపోవు సింగముల్
పరాక్రమంబు మీఱమేము ♦ పట్టితెత్తుమియ్యెడన్

కుళిందుడు—
కరంబు దంబు మీఱఁబోయి ♦ కార్ముకంబులన్నిటన్
ధరం బడంగ వైచి వాని ♦ దక్షిణంబ తెంచిటన్

కిరాతులు—
బరాబరించు దేనినిన్ స ♦ బంబు మాకిప్డుఁ బట్టి స
త్వరంబిటిచ్చి తెత్తు మీప ♦ దాల కాదకుల్ గడున్॥

కుళిం—కిరాతులారా! మీరీక్రివలవేటాడి చెండిన మెకంబులన్నిటి నిటుతెండు. నే నీసేవకుని వెంటఁగొని యీకోనల వేటాడుచుండెదను.

కిరా—దొరా! సెలవు. (అని పోవుట)

(ముక్తపదగ్రస్తవచనము)

కుళిం—సేవకా!

ఈవనంబత్యంత రమణీయంబై మృగయావిహారంబున కెంతయు నుల్లాసంబు గల్పించుచు, నెటుచూచినఁ బ్రళయకాల సంఘటిత జీమూతనివహానిస్వనంబును ధిక్కరించుచుఁ గుధరంబులదర గర్జించు మృగేంద్రంబులును, ఇంద్రవాహనంబున కెనయై శైలంబుల డీకొను నాటోపంబునఁ బోడిమిమిగులుమత్తమాతంగంబులును, సారంగంబుల వెనువెంటనంటి లతానికుంజంబుల గుప్పించుచు

తొప్పలు వెడల పగు పులిను పుండరీకంబులును, పుండరీకంబులఁ దండతండం
బులై వ్రాలి తనివార మధుపానమొనర్చుచు నిచ్చవచ్చినట్లెల్ల విచ్చలవిడి
పెచ్చరిలి వియచ్చరుల కరణి పాటలు బాడుచు మింటనడయాడు శిలీము
ఖంబులును, శిలీముఖంబులకన్న మిన్నయగు కలస్వనసమ్మిన మొనలేర్చి బా
లారుణారుణ్యంబున నిరవొందు కిసలయంబులును, లయజ్ఞాన సంకలిత మధుర
గానామృత రసాస్వాదనపరత్వంబున ఫణంబులెత్తి చిత్తము లలర వీక్షించు
పన్నగంబులును, నగంబులపై గమకించుచు సంద్రింబులఘుంచిన వానుమం
తుకరణి మధురఫలభక్షణంబున నపేక్షలీడేర్చుకొను ప్లవంగనికాయంబులును,
కాయజపరివారంబులని ప్రియదాజనంబు లదర సందడిగ దండు వెడలు
పరభృతకీరశారికాదిపతంగంబులును, పతంగమండల పరీవ్యాప్తంబులై సప్తా
శ్వంబుల నరికట్టు రసాలాది తరువితానంబులును, వితానంబుల దేవదా
రువులకుఁ బెనంగొనిన పుష్పిత లతానికురుంబంబులును గలిగి చెలంగుచున్న
యీయారామమును జూడఁజూడ నీమలేని పోడుములకుఁ గూడలియై
తనరుటయె కాక క్రూరమృగావాసముగఁ గనుపట్టుచున్నది. కావున నీవతి
జాగరూకతతో మెలంగవలయు.

సేవ—నేను మిక్కిలి జాగరూకతతోడనే మెలఁగుచున్నాఁడను.

కులీం—సేవకా! యెట్టి చిత్రము. మెల్లన పొంచి చూడుము.

తే॥ గీ॥ నికుంజములోనుండి ♦ యాఁడులేఁడి
వేఁటకుక్కనుగనుఁగొని ♦ వెంటనంటి
రొప్పుచును మగఁటిమియెల్లఁ ♦ దప్పిపార
దరుముచున్నదియెట్టి చి ♦ త్రింబొకనుము॥

సేవ—దేవా! మిక్కిలి చిత్రము. దీనత్వముననుండెడి లేడికే యింతటిశౌర్యముంట
నింకక్రూర మృగములకెట్టి విక్రమముండవలయు.

కులీం—కావుననే జాగరూకతతో నుండుమని చెప్పితిని.

సీ॥ పర్వతంబులుమాఱు ♦ బలుకుచుండగఁ బెద్దపులిపెట్టునట్టి బొ ♦ బ్బలను వినుము
ఈమార్గమున వ్యాఘ్రి ♦ మేగినట్లెఱిఁగించునిదుదలొపాదచి ♦ హ్నలను గనుము
అటుపొదల్ గదలెను ♦ తటుకునబల్లెముల్ తేగలు గైకొని ♦ వేగచనుము
జాగరూకతతోడఁ ♦ జనుదెంచియుపమను నెకవ్రేటునకుభువి ♦ నొరగఁజేయుము

ఆ॥ వె॥ ఒంటివాఁడవగుట ♦ నొక్కింత గ్రొత్తన
ధైర్యమెదనువిడువఁ ♦ దగదుగాన
నిండుమదిని మెకముఁ ♦ జెండిన చెంతకీ
వేగవెమ్ముపొమ్ము ♦ వేడ్కమీఱ॥

మఱియు నీవనమధ్యంబునఁ బెక్కు మునీంద్రాశ్రమంబులు గలవు. కుదుకునసంబున వారికేమైన నెగ్గొనరించెదవేమో సుమీ! బహుభద్రముగా వేటాడిరమ్ము.

సేవ—అయ్యా! తాము సెలవిచ్చినట్లు నేనిప్పుడేచని వేటాడెదను. నేనెక్కడనేగా న నాకొకప్పుడు భీతిదోఁచును అప్పుడు నేనేమి సేయవలయు?

కుళిం—ఛీ! ఇప్పుడేయవాచకంబులాడుచున్నావు. ఇట్టివాఁడ వెట్లు వేటాడఁగలవు! నీకేదేని ప్రమాదముగల్గినట్లయిన నేనీపొంతలనే వేటాడుచుండెదను. నన్నుఁ బిల్చి పరుగిడిరమ్ము.

సేవ—అయ్యా! కోపింపకుఁడు. నాతల్లికి నేనొక్కడనే. ఆయాననేమి కాలముకా క యారకున్నాడనుగాని లేకుండిన నాతో పాటియెవరు. ఇదే పోయివచ్చె ద (అని చనుట).

కుళిం—(పొదలలో దూరుచు తనలో)

ఉ॥ ఈపొదరింటిలోనఁ గల ♦ దేనుఁగుదంతము దాసికావలన్
జూపులపండు నైకలను ♦ చొక్కపుముత్యపురాసియింతకీ
దాపులనున్నకోనలను ♦ దగ్రపరాక్రమ సింహజాలమున్
కాపురమున్నచందమునఁ ♦ గన్పడుచున్నది పోవునియ్యెడన్॥

(మఱియొకదిశకుఁ బోయి)

చ॥ అరరె భ్రమించెనాదుమన ♦ మాపొదరిల్ నిలువెల్లఁ గొల్లగాఁ
విరులనుగప్పియుండు సర ♦ విన్ గని యిందుమహామునీంద్రుఁడో
కరుఁడు తపంబుఁ జేయుచు ము ♦ ఖంబునవస్త్రము దాల్చెనంతనా
దరమున మ్రొక్కఁ జూచితిని ♦ దైవవిచిత్రము లెన్నశక్యమే॥

(విరోధము)

ఏమి చిత్రము! ఇంతదవ్వుల కరుదెంచిన నొక్క మెకంబైనఁ గానరాదయ్యె. మఱియొకదిశకైనఁ బోయెదను. (అని చనుచుఁ దనలో)

# ద్వితీయాంకము.

క॥ తుమ్మెదషండారంబులు
కమ్మనిప్రతిగాఁగఁబిక ని ♦ కరవారముగ
తమ్ములుగాఁగను విపస
ర్వ్యమ్ములు రసికాళిగాఁగ ♦ భాసిలుచుండెన్॥

(నర్మము)

సేవ—(పరుగెత్తుచు వచ్చి బిగ్గరగా.)
అయ్యా! రక్షింపుము! రక్షింపుము! (అని కాళ్ళపైఁబడుట)

కుళిం—భయపడకుము! భయపడకుము! (అని లేవనెత్తి) నీకేమియపాయముగల్గె?

సేవ—నాదేహము వడకుచున్నది. నేనెంతయుమాటలాడఁజాల

కుళిం—(వెన్ను చరుచుచు) నీకేమిభీతిలేదు. నిబ్బరించుకొనుము. బెబ్బులిమారొ—నెనా! సింగములు వెంటనంటెనా! యేమిసంభవించెఁ జెప్పుము. నేనిప్పుడే చని చెండెదను.

సేవ—(వడకుచు) అయ్యా! తమకడనుండి కొంతదూరము పోయినపిదప నేదో యొకమృగము పొదనుండి వెలువడి పరుగెత్తి వచ్చుచుండఁగని వడకెత్తె. పరుగిడి ప్రాణములు కాపాడుకొని యిట్లువచ్చితిని.

కుళిం—అది యేమృగమయియుండును?

సేవ—ఏమృగమయినది చెప్పఁజాల.

కుళిం—అట్టిమృగంబేదైయుండును? చిన్నెలేమైనఁ జెప్పఁగలవా!

సేవ—పెద్దపెద్దచెవులు గలవు.

కుళిం—ఏనుఁగా?

సేవ—కాదు కాదు. దానిని మనమెఱుంగము.

కుళిం—దానికిఁదప్ప మఱియేమృగంబునకుఁ బెద్దచెవులుగలవు? ఇంకేమిచిన్నెలు గలవో చెప్పుము.

సేవ—కురుచకాళ్ళను భూమికి జానెడెత్తును తెల్లనివర్ణమును, చిన్నతోఁకయును గలదు.

కుళిం—ఓహో! అట్లయినచో అదిమృగముకాదు. కుందేలైయుండును. దానికా భయపడితివి.

సేవ— ఔనౌను ! నిజము ! నిజము ! అట్లేయగుపడినది. ఆదివలలోప న్నెవ్వ దేతప్ప విశిగా నెన్నడును జూడలేదు.

కుళిం— అట్లయిన నీవుమహాశూరుండవు. నావెనువెంట నంటిరమ్ము. మఱియొకదిశకరిగి వేటలాడెదము. (అని చనుచుండుట)

బాలు— (దూరమున పొదలలోనుండి తనలో)

కీర్తన ఆనందభైరవిరాగము-ఆట.

పుణ్యపూరుషులెవరు లేరే ♦ యీ ♦ దైన్యమునె
డబాపిదయజూడరారె ॥ పుణ్య ॥
ఎన్నివిధములవేడుచున్న ♦ నన్ను ♦ మన్నించి
రక్షించుమనుజులున్న ॥ పుణ్య ॥
న్యాయమెంతయు లేకపోయె ♦ అ ♦ న్యో
యజాక్షుడు బాధ ♦ తోలంగింపడాయె॥ పుణ్య॥

అబ్బా! తాళజాల ప్రాణములు పోవుచున్నవి. (అనిపడిపోవుట)

కుళిం— సేవకా అదేమో వినుము ?

తే॥ గీ॥ ఓరిసేవకయాలింపు ♦ మారవంబు
బాలుడెవ్వడో యేడ్చిన ♦ భంగిదోచె
నిట్టికానల నట్లుంట ♦ కేమికతమొ
గాంచివత్తము రమ్మువే ♦ గమునవరిగి॥

చోరులెవరో బాధించుచుండ బాలుడేడ్చినట్లువినిపించుచున్నది. పోవుదమురమ్ము.

సేవ— అయ్యో ! దొంగలనుమాటకే భయపడువాడను. నాకిప్పుడే దేహము వణకుచున్నది.

కుళిం— నీకేమియు భయములేదు నావెంటరమ్ము. (అని యిరువురునుబోవుట)

ద్వితీయరంగము.

(పొదలోని బాలుని కుళిందుడు సేవకుడు చూచుట)

కుళిం— సేవకా! యేమి యీచిత్రము?

మధురగతిరగడ. ఝంఝూటిరాగము-ఆదితాళము.

ఎవ్వరివాడొకో ♦ యీసుకుమారుడు
పువ్విలుకానికి ♦ బుత్రుడనదగు॥

పున్నమచందురుని ♦ మోమునఁ గేరుచుఁ
జెన్నుతరిగియుటఁ ♦ జేరుటయేలనొ॥ ఎవ్వరివాఁడో॥

సేవకా! వీని నెవరో ఘాత సేయ నేడిచి యేడిచి పరుండినట్లు తోఁచుచున్నది. ఇట్టి దివ్యమంగళాకారునిపై నెట్లుచెయ్యాడెనో సుమీ! వీనియేడుపువినిన నా ప్రేవులు తటిగికొనిపోయినవి. పాపము ముఖముకందినది. అక్కటా వీఁడెవ్వఁడోకదా. ఎట్టిబెట్టిదంబులుచేకూరె.

క॥ అద్దిరయా బాలుండిట
నిద్దురచేయున్నవాఁడు ♦ నేవీనిగనన్
ముద్దిడుకొన నామనమునఁ
బెద్దగజనియించెఁబ్రేమ ♦ పెంపుదలిర్పన్॥

భూరా! యేమి వీనిసౌందర్యము.

మ॥ అరరే యచ్చటఁగానమీసరుల సొం ♦ పాహా కపోలాంశుకాం
తరమా రాకసుదోయిచక్కదన ము ♦ న్నన్నా కరసార్వవి
స్తర మఝ్ఝారెపదాంబుజంబులరుచుల్ ♦ శాబాస్ తనూకాంతి వా
వ్వారె వీనింగనినట్టి దంపతుల పు ♦ ణ్యంబెట్టిదో సేవకా॥

మఱియు.

(నర్మద్యుతి)

ఉ॥ నందునియిల్లువెల్వడి వ ♦ నంబఘనంబని వచ్చినట్టి గో
విందుఁడో నందనంబనుచు ♦ వేడుకనిందరుడెంచినట్టి సం
క్రందనుపట్టియో యతఁడు ♦ గాకుదధిన్ విడివచ్చినట్టి బా
లేందుఁడొ కాక యిట్టి సొబ ♦ గెరిక్కనైనఁ బొసంగునే భళీ॥

(ఉపన్యాసము)

సేవకా యేమిమనభాగ్యము. నేడెట్టిసుందరమూర్తిన్ నీ గనఁగల్గె.

సీ॥ ఈచిన్నిపాపని ♦ నెత్తిముద్దాడెడు నట్టివారిదె పో మ ♦ హావిభూతి
ఈబుడుతనుజేరి ♦ యెక్కసక్కెములాడునట్టి వారిదెపోవ ♦ చోతిశయము
ఈపట్టియురముపై ♦ దీపింపఁబపలించు నట్టివారిదెపో సు ♦ ఖానుభవము
ఈబాలుఁబాలునే ♦ ఁయ్యడి పెంచునట్టి సజ్జనులదే పో జన్మ సార్థకంబు॥

తే॥ గీ॥ అహహా యీ సూనుఁ డింటిలో ♦ నడుగు బెట్టి
మొలకనగవుల నాడుట ♦ గలిగె నేని
కలుగవే యెల్లసంపదల్ ♦ పొలుపు మీఱ
వన్నె కెక్కఁడె యాతని ♦ వంశ మెల్ల.

ఇదేమి చిత్రమో కాని వీనిని వీక్షించినది మొదలు నామనము చంద్రునిగన్న సంద్రము వలెఁ బొంగుచుఁ గరుణారసము వెల్లివిరియుచున్నది. ఇట్టివాఁ డొక్కఁడైన నాకుఁ గల్గు భాగ్యమబ్బదయ్యెను గదా! ఇట్టి పసిబాలుం డిట్టి ఘోరాటవి పాలగుటకుఁ గారణమేమో తెలియరాదు. వీని వేలు కోసియున్నది. అక్కటా! పాపము. ఎంత ఘాత జరిగె. ఇట్లు చేసిన దురాత్ము లెవ్వరో గదా. కనుఁగొంచిన దునుమాడెదను. వీఁ డెవ్వని బాలుండై యుండును.

ఆ॥ వె॥ వీనిముఖమునందు ♦ విపులతేజ మొసంగెఁ
జెంచు బాలకుండో ♦ చెనటికులుఁడో
కాఁడు కాఁడు రాజ ♦ కాంతునిపట్టి గాఁ
దోఁచుచున్నదెట్టి ♦ దో నిజంబు.

(ప్రగమము)

సేవ—అయ్యా! నాకును రాచకుమారుని వలెనే కనుపట్టుచున్నాఁడు. ఎల్లదేశములను జల్లగఁ బాలించు మన్నీని చెన్నుగలవాఁడుగనున్నట్లు తోఁచుచున్నది.

(వజ్రము)

బాలు—ఛీ! దురాత్ములారా! మరల నేవ్రేలు కోయవచ్చితిరి?

కుళిం—నాయనా నీ వెవ్వండవు.

బాలు—ఆ॥ వె॥

చేతవచ్చినంతఁ ♦ జేసి యెవ్వఁడవని ♦ యిప్పుడడుగనేల ♦ నింతకైన
బాధలన్ని దీరఁ ♦ బదపడి నాకింత ♦ విషము నిచ్చియైన ♦ విడువరయ్య

కుళిం—తండ్రీ! భయపడకుము నిన్నుఁ జెండినవారిని ఖండించెదము. చెప్పుము.

బాలు—నేనేమి చేసితి! యిప్పుడే మారు వేషధారులై వచ్చితిరా.

కుళిం—అయ్యా! నీకపకృతి సేయవచ్చినవారము కాము. నిన్ను రక్షించెదము. నీవృత్తాంతమేమో చెప్పుము.

పున్నమచంద్రుని ♦ మోమునఁ గేరుచుఁ
జెన్నుతరిగియుటఁ ♦ జేరుటయేలనొ॥ ఎవ్వరివాఁడో కా॥

సేవకా! వీనినెవరో ఘాతసేయ నేడిచి యేడిచి పరుండినట్లు తోఁచుచున్నది. ఇట్టి దివ్యమంగళాకారునిపై నెట్లుచెయ్యాడెనో సుమీ! వీనియేడుపువినిన నా ప్రేవులు తఱిగికొనిపోయినవి. పాపము ముఖముకందినది. అక్కటా వీఁడెవ్వఁడో కదా. ఎట్టిబెట్టిదంబులుచేసూరె.

క॥ అద్దిరయీ బాలుండిటు
నిద్దురచేనున్న వాఁడు ♦ నేవీనిగనన్
ముద్దిడుకొన నామనమునఁ
బెద్దగజనియించెఁబ్రేమ ♦ పెంపుదలిర్పన్॥

ఔరా! యేమి వీనిసౌందర్యము.

మ॥ అరరే యెచ్చటఁగానమీకురుల సొం ♦ పాహా కపోలాంశుకాం
తరమా రాకనుదోయిచక్కదన ము ♦ న్నన్నా కరసార్ఫవి
స్తర మజ్ఝారెపదాంబుజంబులరుచుల్ ♦ శాబాస్ తనూకాంతి వా
హ్వారె వీనింగనినట్టి దంపతుల పు ♦ ణ్యంబెట్టిదో సేవకా॥

మఱియు.

(నర్మద్యుతి)

ఉ॥ నందునియిల్లువెల్వడి వ ♦ నంబఘనంబని వచ్చినట్టి గో
విందుఁడో నందనంబనుచు ♦ వేడుకనిందరుదెంచినట్టి సం
క్రందనుపట్టియో యతఁడు ♦ గాకుదధిన్విడివచ్చినట్టి బా
లేందుఁడొ కాక యిట్టి సొబ ♦ గేరికినైనఁ బొసంగునే భళీ॥

(ఉపన్యాసము)

సేవకా యేమిమనభాగ్యము. నేడెట్టిసుందరమూర్తిని గనఁగల్గె.

సీ॥ ఈచిన్నిపాపని ♦ నెత్తిముద్దాడెడు నట్టివారిదెపో మ ♦ హావిభూతి
ఈబుడుతనుజీరి ♦ యెక్కసక్కెములాడునట్టి వారిదెపోవ ♦ చోతిశయము
ఈపట్టెయురముపై ♦ దీపింపఁబవళించు నట్టివారిదెపో సు ♦ ఖానుభవము
ఈబాలుఁబాలునే ♦ ర్వ్యడిపెంచునట్టి సజ్జనులదేపో జన్మ సార్థకంబు॥

డెట్టికష్టముల పాలయ్యె. వీనిని మనయింటికి గొంపోయిన నాయింతి యెంతటి సంతసము నొందునోకదా. నాకెంతటిభాగ్యము బ్బెను. నేనాపుత్రహీనుండ. నేనితని స్వీకరించిన నాపితృపితామహులును దరింతురు. నానోముఫలించును. ఎట్లయినను వీనినొప్పించి మనయింటికిఁ గొనిపోయెదము.

సేవ—చిత్తము ! నెలవిచ్చిన నేనేయేదో బెదరించి సరే అనిపించెదను.

కుళిం—ఛీ ! అట్లేల నేనే చక్కఁగా బుజ్జగించెదను. (బాలునిపట్టుకొని) నాయనా బాలకా.

చ॥ కటకట నీపదాబ్జములు ♦ కర్కశభూములద్రొక్కనొచ్చెఁగు
ర్ఘుటమగు కోతబాధలను ♦ గగ్గెను దేహము క్షుత్పిపాసచే
నిటలమువాడె నేడు ప్రన ♦ నీదుకనుంగవయాశ్రనింక సం
కటములు దీరుటెట్లు కల ♦ కాలమునీవనభూమినుండఁగన్॥

(పుష్పము)

సీ॥ చిన్నినీపదములఁ ♦ జిఱుగజ్జియలు జేర్చఁ బ్రబలుపొంకింతని ♦ యిల్లఁ దరిరా
నీముద్దుకేల్గవ కెలమిభూషలుగూర్ప నదరునింపింతని ♦ మదువపరా
లలితమౌనీమేన ♦ జిలుగువల్వలుదాల్పఁ దగుహాయలింతని ♦ తలఁచఁగలరా
నీమోహనాకృతి ♦ నృపపీఠమునుపరాఁగలయశంబింతని ♦ తెలుపఁగలరా

తే॥ గీ॥ అకటసుకుమార నిమగూరిరు ♦ లకవిలోన
నడుగువేర్లొక్కయఁ జేయెట్టు ♦ లాడనెక్క
భస్మమునుగప్పుకొన్న పా ♦ వకునికరణి
వెతలలోమున్గియుంటివి ♦ కుతుకము సిగి.

బాలు—అయ్యా ! నక్కను దేవలోకవార్తలు చెప్పినట్లుగ నిదరిద్రునకు రాజవైభవంబులేల. చెప్పెదరు ?

కుళిం—నాయనా ! యిచట యెంతవిలపించినను నిన్నాదరించువారెవరు ! ఇంతకును నీక్షుత్పిపాసలైనఁ దీర్చుకొనవలయునుగదా ! ఇచ్చటికి దాపున మాయూరుగలదు. మాతోడవచ్చి సేదదీర్చుకొందువు రమ్ము.

బాలు—ఇదివరలో కూరిరులుబట్టి యీడ్చితెచ్చి పేలుకొసిన నేనేమిచేయఁగలిగియుంటిని. ఇప్పుడు మీరు మన్ననచేఁ బిలువ నేలరారాదు. అట్లేవచ్చెదను.

(పర్యుపాసనము)

సేవ—ఆహా! మనభాగ్యమేమందును. రత్నమువంటి బాలుఁడుదొరికె. వీనివలన మీకు సకలసంపదలు సమకూరును. నేను వీనినెత్తుకొని వచ్చెదను.

కుళిం—మంచిది. అట్లేతెమ్ము. (అని చనుట)

సేవ—అయ్యో! నాదేహమే నేను మోయలేకున్నాను వీనినెట్లు మోయఁగలను. ఇది యంతయు నాప్రాణమునకు వచ్చినది. అయినను తప్పదు. (అని బాలునినెత్తుకపోవుట.)

(ముఖసంధి సమాప్తము)

## తృతీయరంగము. (శుద్ధవిష్కంభము.)

(బావయు మఱఁదియు ప్రవేశించుట)

మఱఁది—(బావనెదుర్కొని) ఓహో! బావగారూ యెంతకాలమునకు దర్శనమిచ్చితిరి. ఎచ్చటెచ్చటతిరిగితిరి. ఎచ్చటనుండి వచ్చుచున్నారు. ఏమితెచ్చినారు. ఇంతబలుపేలగలిగినది. నేనుగుర్తింపలేనైతిని. ఇటీవల మీపై నెట్టిదుర్వార్తలో పుట్టినవి. మాయక్కగారు శిరోజములను దీయించుకొనినదిగదా ఇంతకాలము జాడలేకయుండవచ్చునా!

బావ—ఓరిశుంఠా నన్ను పెద్దవానినిజేసి హేళనపట్టించుచున్నావా! నాపై నెట్టివార్తలుపుట్టె?

మఱ—మీరొక రాజగృహంబునఁజేరి భుజించుచుండి యజీర్ణవ్యాధిచే స్వర్గస్థులైనట్లు చెప్పుకొనిరి.

బావ—ఛీ! ఇదిఅంతాకల్లయే నీవే యవాచకములు బల్కుచున్నావు.

మఱ—అంతానిజమే. మీకునిలకడమీదఁగాని తెలియదు. ఎచ్చటనుంచి వచ్చుచున్నారో చెప్పరైతిరి.

బావ—అంగ వంగ కళింగ కాశ్మీర కాంభోజ బర్బర యవన మగధ మాళవ కొంకణ టెంకణాది దేశములు తిరిగితిరిగి శాబరదేశపు రాజధానియగు చందనావతిపురముఁజేరితిని. అచ్చటిరాజగు కుళిందుఁడొకనాఁడు వేటకుఁబోవ నడవిలో నొకముద్దులబాలుఁడు దొరకెనఁట. అతఁడాఁచిన్నవాని నింటికిఁదెచ్చి కన్నకుమారునికన్న మిన్నగఁబెంచుచు వానికి శాస్త్రబద్ధంబుగా జాతకరణ నామకరణాది కృత్యంబులన్నియుఁ జక్కఁగా జరిపించుచుండె. అప్పుడు నే

నచట నేయుంటిని. ఆబాలునికి నామకరణనిర్ణయము సేయఁబోఁవక వంశీకులె ల్ల వెనకముందాడుచుండఁగా నేను దిగ్గునలేచి వీనిముఖము చంద్రునిహసించు చున్నదిగాన వీనికి చంద్రహాసుండని పేరు పెట్టిన మేలని చెప్పితిని. అంద ఱును సంతసించి యానామమే పెట్టిరి. రాజుగారు నన్ను మెచ్చుకొని నా యతిశయమునకు నీశాలువనప్పుడే బహుమతిచేసిరి.

మఱి—నీయే యతిశయమునుజూచి బహుమతియిచ్చిరి.

బావ—నావిద్యాతిశయమును జూచి వేరే చెప్పవలయునా? ఆబాలుఁడు వచ్చినది మొదలు కుళిందునకు సమస్తభాగ్యములు సుప్పొంగుచుండె. ఇప్పటికి పది యూరేండ్లవాఁడై దివ్యమంగళాకారుండై యున్నవాఁడు. వానినా రాజు యు వరాజ్యాభిషిక్తునింజేసి తానునిమిత్తమాత్రంబుగా పాలించుచుండె. అతఁడు యువరాజైనది మొదలు పెక్కుసేనలను గూర్చుకొని సమస్తరాజులపై దం డెత్తి వారియిచ్చుసంపదలెల్లఁ జూరగొని తెచ్చుచు రెండవచక్రవర్తియో యను నట్లు ప్రకాశించుచున్నవాఁడు.

(ప్రవేశకము)

ఆచిన్నవాఁడిప్పటికిఁ గట్టించిన సత్రశాలలును వనంబులును దేవాలయంబులును పె క్కులుగలవు. ఆపురంబున మిగులఁబ్రసిద్ధంబగు నన్నసత్రమొకటి పెట్టించె. నాసత్రంబుననే యీపనునాలు గేండ్లు గడపి మరలియిప్పుడువచ్చుచున్నాను.

(అంకాస్యము)

మఱి—సంచారము ముగించితిరా మీరాక యింటికెటిగింతునా!

బావ—వలదువలదు. కొంచెముపనియున్నది. ఇప్పుడు కుంతలనగరంబున ఆమహా రాజుగారి ముద్దులకుమారియొక్క జననకాల మహోత్సవము జరుగుచున్నది. ఆచట భక్ష్యభోజ్యంబులతో నన్నముపెట్టివరహాలు సంభావనలిచ్చెదరట. అ క్కడికిఁబోయి వచ్చెదను. ఇదిగో చాటించుచున్నారు. వినుము. సామంత రాజులెల్లఁదమతమ మంత్రిపురోహితులచేఁ గట్నంబుల నంపుచున్నారు.

మఱి—నేనును వచ్చెదను. సంభావనయిప్పించెదరా!

బావ—ఇట్లువచ్చిన నీకెవరు సంభావన యిచ్చెదరు? ముఖమున విభూతిపూసి నాకు శిష్యుఁడవుగానుండి నావెంటరమ్ము. పోదము. (అని యిరువురును నిష్క్ర మించుట.)



శ్రీ

# శృంగార చంద్రహాసీయము.

## తృతీయాంకము.

### ప్రథమరంగము.

(కుంతల రాజుసభ)

(కుంతలుఁడు దుష్టబుద్ధి గాలవుఁడు చంపకమాలిని మొదలగు మంత్రిపురోహితులును)

కుంత—మంత్రివర్యా! కార్యప్రారంభము సేయుటకేమి యోజన.

దుష్ట—మహాప్రభూ! సర్వంబును సిద్ధమయినది. మనకులగురువర్యుండగు మహేశ్వరకుమారశాస్త్రిగారింకను రారైరి. వారికై చూచుచున్నాను. (ప్రక్కనుండి వృద్ధబ్రాహ్మణుఁడు ప్రవేశించుట) ఓహో! వీరునువచ్చిరి. రాజేంద్రా సెలవు. బ్రాహ్మణులారా! ప్రభువుగారి యాజ్ఞచొప్పున కార్యోపక్రమణము జేసి యాశీర్వదింపుఁడు. (బ్రాహ్మణులాశీర్వదించుట)

అంకావతరణము.

మహాప్రభూ! భవదీయపుత్రికా జననకాల మహోత్సవ దర్శనార్థమై మనసామంతులెల్లఁ గట్నంబులనిచ్చి వారివారి మంత్రిపురోహితులంబంపవచ్చియున్నారు. సెలవైనచో వానినెల్ల సమర్పించెదను.

కుంత—మంచిది.

దుష్ట—ఒకనియొద్దకువచ్చి. (పళ్ళెరముజూపుచు)

క॥ ఈమానికములు తూరుపు
భూమీపతులంపినారు ♦ ముదమారఁగనీ
గోమేధికములుదక్షిణ
సామంతులుబంపిరధిక ♦ సంతోషమునన్.

మఱియొక్కనికడకు వచ్చి (పళ్ళెరమెయెత్తి చూపుచు) స్వామీ! యీపచ్చలన్నియు పాశ్చాత్యనృపాలురు పంచిరి.

ఘటియొకనికడకువచ్చి రాజేంద్రా ! యీపసిఁడినాణెములన్నియు సూత్రధారునిచే లు బంపిరి.

గాలవునియొద్దకువచ్చి వళ్ళెరము పుచ్చుకొని మహాప్రభూ! ఇది కుళిందుఁడు పంపిన కట్నము. ఇతఁడు తక్కినవారివలెఁగాక పెక్కురాజభూషణములు నంపె. ఇవియే తిలకింపుఁడు.

క॥ ఇవి మానికములహారము
లివి మణికోటీరవితతు ♦ లివి భుజకీర్తుల్
ఇవి రత్నఖచితపత్రకము
లివి కనకమయాంబరమ్ము ♦ లివి కంకణముల్ ॥

కుంత—మిక్కిలిచిత్రము! సామాన్యుండగు కుళిందునకీ రాజభూషణములన్నియు నెట్లులభించె ! ఏవీ చూతము. (అని పట్టిచూచుచు)

శా॥ ఈకేయూరము కోసలేశునిది కా ♦ దే యీమణీహారము
స్తోకప్రాభవుఁడౌ కుళిందునిది కా ♦ దోఁ యీకిరీటంబు బతు
ల్యాకారుండగు మాళవేంద్రునిది కా ♦ దా యీదుకూలంబులే
భూకాంతాళివి గాక వానివియె యే ♦ మో దీని యోజింపుమా ॥

మంత్రివర్యా ! మనకుఁ గప్పంబులీయక మార్మసలినవారి భూషణాదులెల్ల వీని కెట్లు లభించె ?

దుష్ట—చిత్తము. తాము సెలవిచ్చినదెల్ల నిక్కువమే. ఇదే మనవి చేసెదను.

గాలవా ! నీవుతెచ్చిన కట్నంబునఁగల రాజమకుటకేయూరాది విభూషణములెల్ల బలవిక్రమవశులగు వివిధరాజన్యులవి. అవిపడయ సామాన్యులకు శక్యంబుగాదుగదా. అబలుండగు మీరాజునకెట్లులభించె? దీనివృత్తాంతము సాంతంబుగా మహాప్రభువారు వినఁగోరుచున్నవారు. సమూలమ్ముగ విన్నవింపుము.

గాల—చిత్తము.

(పతాకము)

శా॥ అయ్యా మాపతికొక్కసూనుఁడుగలం ♦ డత్యంతశౌర్యస్ఫురుఁడై
కయ్యాలం గడు బల్లిదుఁడనంగ జో ♦ క సర్వరాజన్యుల
వెయ్యాజ్ఞలు గెల్చి వారిసిరులు ♦ విఖ్యారుచుఁ దెచ్చితా
నయ్యంగన్గని మ్రొక్కి మ్రోలనిలిపెన్ ♦ బ్రాంచద్వినాసంబునన్॥

మ॥ అతఁడత్యంతప్రమోద ముప్పతిలఁగా నాయర్థమందొక్కపాల్
కుతలాధీశ్వరుఁడైన కౌంతలునకున్ ♦ గొంపోయి యర్పించిరం
డతివేగంబుననంచుఁ బంపుటయునే ♦ నావిత్తముంబూనీ వ
చ్చితినీయుత్సవవేళ శ్రీప్రభుని ద ♦ ర్శింపంగ సద్భక్తితోన్॥

దుష్ట—మంచిది. కుళిందు డెంతటి ఘనుఁడయ్యె ! అతనికిట్టి సుతుండుగలఁడా ? వాని నామగుణవిశేషంబులు దెలుపుము ?

గాల—వానిపేరు చంద్రహాసుఁడు. వానిగుణగణములు వర్ణింప మాబోంట్లకలవియే ? అయిన నానేర్పుకొలఁది విన్నవించెదను.

(మార్గము)

సీ॥ వింటినెక్కిడి రణ ♦ వీధికైచూచిన గాండీవికెనయనఁ ♦ గాఁజెలంగు
నెంతటియపరాధి ♦ నేనియుశ్శరణన్నఁగాచుచోహరుసరి ♦ గాఁబొసంగు
ధర్మపద్ధతిఁబూని ♦ ధరణిఁబాలించుచో నంతకసుతతుల్యుఁ ♦ డన మెలంగు
భగవత్పదధ్యాన ♦ భక్తియుక్తిని నిల్వ గాంగేయునకు సాటి ♦ గానెసంగు॥

తే॥ గీ॥ నతనిగుణములు వర్ణింప ♦ నస్మదాది
జానపదులకు శక్యంబె ♦ జగతియందు
నీడునకుఁ బదియాఱేండ్లు ♦ వాఁడెకాని
గుణసమృద్ధికి వృద్ధుఁడై ♦ గణనకెక్కు

దుష్ట—మిక్కిలి సంతసనీయము ! (తనలో) ఓహో ! వీఁడెవఁడు ? ఇట్టిప్రజ్ఞా వంతుండని చెప్పుచున్నవాఁడు. ఇంతటివాడెంతటికార్యమునైనఁ జేయఁగలఁడు. మనయుద్యమమున కేమయిన భంగము కలుగఁబోవునేమోకదా ! మనతలంపు వ్యర్థమగునా ! కాదుకాదు. అయినను మొలకనాఁడే త్రిళ్లినఁబిలకవేయఁజాల దన్నట్టు లిప్పుడే యేదేని కల్పించుకొని వానికడకుఁబోయియే మోసముచేసి వానిని జంపింపవలయు. ఇది తక్షణము చేయవలసినపని.

మహారాజేంద్రా ! ఇప్పుడీ కుళింద పురోహితుండు మనవిచేసినదెల్ల దేవరకు వేద్యమయ్యె. ఇంతటిమహాబలుండు మనకుసామంతుఁడన్నఁజాలును. కావున వానికి మనమన్ననలం దెలిపివచ్చుట యుచితంబు. అట్టిపని నెఱవేర్చుకొని రాన వరిని నియోగింపవలయునో శెలవీయఁగర్తలు.

కుంత—ముఖ్యము ! ముఖ్యము ! ఇందులకుఁదగు యుక్తియుక్తంబులు నేర్చిననీవు గాక మఱియెవరుసమర్థులు ? నీవే శ్రమచేసి పోయివచ్చుటయుచితము.

దుష్ట—చిత్తము.

గాలవా ! మహాప్రభువువారి యాజ్ఞానుసారంబుగా మంత్రివర్యుండు మీదర్శనార్థమై వచ్చుచున్నాఁడని మీరాజునకుఁ దెలుపుము.

గాల—భాగ్యము మహారాజా ! ఆశ్రితునకు సెలవు.

కుంత—
దుష్ట— } మంచిది.

(అందఱు నిష్క్రమింతురు)

## ద్వితీయరంగము.

(దుష్టబుద్ధి చందనావతిపురికి వెడలుట)

దుష్ట—(తనలో) ఏమి యిదియెంతవిపరీతము ! కుళిందుఁడపుత్రికుండని జ్ఞాపకము. వీనికిఁబుత్రుండెప్పుడుకలిగె? ఇంతటి బలాఢ్యుఁడెప్పుడయ్యె? ఇందలివిషయమై నాబుద్ధిబలమెల్లను బ్రయోగించి వీనిని మట్టుపెట్టునుపాయము వన్నవలయు. లేకున్న మనప్రతిజ్ఞకు భంగముకలుగుటయే నిశ్చయము. నేను మున్ను కప్పంబులకుం జని జరిగించిన జగడములలో నన్ను పరాభవపఱచిన రాజులమౌ దలలంగల కిరీటాదులెల్ల కొల్లగొనివచ్చిన వీనికేశౌర్యములును తృణప్రాయములు కావా ? నామనస్సునకీవార్త మఱిమఱీ ముల్లునాటినట్లున్నది. యిట్టివానియెడల జాలిగాని యోర్పుగాని తలపరాదు. (అని వెడలిపోవుట.)

(దుష్టబుద్ధి త్రోవలో సత్రశాలగనుట)

దుష్ట—అబ్బా! యిప్పటికిచాలాదూరమువచ్చితిని. యిచ్చటనేదో విశ్రమశాల కనుపించుచున్నది. యిందుకొంతతడవు నిలిచిపోయెదను. (అని సత్రముననకూర్చుండి పైనచూచి) యేమోవ్రాసియున్నది. దీనినికట్టించినవారు శాసనము వేయించిరికాఁబోలు. (చదివెదను)

చ॥ విమలయశుండు సర్వనృప ♦ వీరకిరీట మణీఘృణీలస
త్క్రమలనిభాంఘ్రియుగ్మఁడు రు ♦ కాంతిజితార్కుఁడు చంద్రహాస భూ
రమణుని సత్రశాలయిది ♦ రాత్రిబవళ్ళు వసించువారి క
న్నము వసనంబులేరికయి ♦ నన్ గృపనిచ్చెదరెల్లకాలమున్ ॥

(దిగ్గునలేచి) ఛీ! ఇది చంద్రహాసుని సత్రమా! ఇందునిలువరాదు. మనప్రభువు నంతటివారికె సత్రములులేకుండ మర్యాదనైనఁ జూడక సత్రశాలలు కట్టించెఁగాఁబోలు. ఇకకట్టించునునేమో చూతము. నేనిందునిలువ మనస్కరింపదు. (అని లేచి బయలుదేరుచుండుట)

మంత్రికెదురుగ భట్రాజులు ప్రవేశము.

(క్రమము)

భట్రాజు—ఈదినమెవరో యిచ్చటదిగియున్నారు. ప్రయాణమగుచున్నారు. త్వరలోఁబోయి వీరిని కైవారముచేసి పొగడుదము. సంభావనలు దొరకును. (అని వేగముగావచ్చి యెదురొక్కని) ఎడముచేయిచూపి.

జయ! విజయీభవ! దిగ్విజయీభవ! ప్రభవ! విభవ! మహాప్రభూ! నేనొకబట్టుకుమారుఁడ, కవీశ్వరుఁడ, మీసందర్శనార్థమై వచ్చినాఁడ. మీరుగొప్పవారు. నాగొప్పతనమును విద్యను గనిపెట్టి తగుసంభావన దయచేయవలయును. కొమారునివివాహము సమీపించుచున్నది. నేనుజెప్పినకవిత్వము చదువుచున్నాను. చిత్తగింపుఁడీ. (అని బుక్కవిప్పబోవుట)

దుష్ట—ఛీ! దురాత్మా! యెవ్వడవురానీవు! పొగరెక్కి నీయెడముచేతితో మాకుకైవారముచేసెదవు. బుద్ధిహీనా! ఇదినీకు బుద్ధికాదు.

భట్రా—అయ్యా! మీరెవరో గొప్పవారుగానున్నవారు మాటలుమాత్రమట్టివిగానుండలేదు. నేనిదివఱకు నేర్చినవిద్యలన్నియు నవ్వుడే గురువులకొప్పఁజెప్పుచుంటిని ఇప్పుడుమీరునేర్పుచున్న ఛీ! ఛా! అనేక్రొత్తవిద్యలు మీకె యొప్పచెప్పవలయును. అయినను ఈడునకుఁ బెద్దవారుగానున్నారు. అదియైనఁ జూడవలయు.

దుష్ట—ద్రోహీ! నీకిచ్చట సంభావనలిచ్చెవారులేరు. పొమ్ము.

భట్రా—మిమ్మునచూచి యెవరోయని భ్రమపడివచ్చితిని. చాలు! చాలు! పోయెదనులెమ్ము. యింతకు నాయెడముచేతికైవారము సంగతి చెప్పలేదే వినుఁడు.

అగణ్యలావణ్య గుణగణుండును సమస్తరాజన్యకిరీట మణిఘృణిలసత్పాద పీఠుండును దిగంత విశ్రాంతకీర్తివంతుండును నగు చంద్రహాస మహారాజునకు కైవారము సేయు యీదక్షిణహస్తముచే నెరులకు కైవారము చేతునా చేయను. దానికితరులెవరు పాత్రులుకారు. అది ఆమహారాజేంద్రునికే మీదుకట్టితిని.

దుష్ట—ఛీ! ఛీ! పొమ్ము.

భటా—ఆదియేకూడదు. (అని తిరిగివెళ్ళుట తనలో) వీనిపైయేదేని తిట్టుపద్యమొకటి తగిలింతునా! యెంగుకు వానిపాపము వానికేతగులును. (అని పోవుట)

దుష్ట—(తనలో) ఏమీ! వీనివృత్తాంతములు. వినినకొలంది మిక్కుటముగానున్నవి. చంద్రహాసుని యాచించుకొని బ్రతికెడి భట్టువానికే యింతటిశౌర్యముండ నింకవానికెంతటి విక్రమముండవలయు! వాఁడుతలంచినమాత్రమున నేదైన నియు నేలకాదు! కావున దీనికేదో మంచియోజనచేసి కార్యమునెఱవేర్చుకొని రావలయు జాగుచేయరాదు (అని నిష్క్రమించుట)

## తృతీయరంగము.

### చందనావతిపురము.

(కుళిందుఁడు చంద్రహాసుఁడు కూర్చుండుట)

చంద్ర—తండ్రీ! భవదీయాజ్ఞానుసారంబుగా మంత్రివల్లభు నాగమనోత్సవంబునకుఁ దగువిధంబులఁ బురాలంకారాదులనెల్లఁ జేయించితిని మనపురోహితుండు చెప్పినరీతిని వారరుదెంచువేళయు సమీపించుచున్నది.

కుళిం—మంచిది. మనమిరువురును వారికెదురుగా కొంతదవ్వరిగి వారిని దోడితేవలయుఁగానఁ జనుదెంతము (అని నిష్క్రమించుట.)

దుష్టబుద్ధి, కుళిందుఁడు, చంద్రహాసుఁడు ప్రవేశము.

దుష్ట—(పీఠముపైని కూర్చుండి) రాజా! మీరును సుఖాసీనులు కావచ్చును. మీకెల్లరకును క్షేమమేకదా!

కుళిం—తమకృపయే కారణము.

దుష్ట— తే॥ గీ॥ నీవిటీవలఁబంపిన ♦ నిరుపమాన
భూమలనుగాంచి కుంతల ♦ భూవిభుండు
ప్రమదమునననన్ను మన్నించి ♦ రమ్మటంచు
ననునియోగింపఁగా వచ్చి ♦ నాఁడనిందు.

కుళిం—అయ్యా! దేనికిని దేవరకరుణాతిశయమే మూలముకదా!

దుష్ట—మాకృపయేమి! నీబాహువిక్రమమే కారణము.

కుళిం—స్వామీ ! నా బాహువిక్రమము కాదు నేను దమరెఱుంగనివాఁడనా ? ఈతండు నాకుమారుండు, చంద్రహాసనామకుండు. ఇతఁడు బాహువిక్రమంబునఁ జక్కరాజులను జక్కాడి మిక్కుటంబులగు బొక్కసంబుల నెక్కుడ్ము డిఁదెచ్చె. అందు శాస్త్రీయముగా నాల్గవపాలు ప్రభుసన్నిధికిఁ బంపితిని.

దుష్ట—మిక్కిలి సంతసనీయము ! నీవనపత్యుండవని వింటిని. నీకీలక్షణవిలాసుండగు సుపుత్రుండెప్పుడుగల్గె.

కుళిం—అయ్యో ! నాకంతటిభాగ్యమా ! ఇతండు నాకౌరసుండుకాఁడు. పాలకకుమారుండు. వీనివృత్తాంతము వేఱుగానున్నది. దేవర చిత్తగింపదగినది.

చ॥ వినుఁడొకనాఁడువేట కట ♦ వీస్థలి కేనరుదేరచనచ్చటన్
దనకుడికాలివ్రేలెవరొ ♦ తక్కకఁగోయఁగదానసొక్కి వె
చ్చిన వ్యసనంబునన్ నిదుర ♦ జెందినికుంజమునం బరుండఁగాఁ
గనుఁగొని తెచ్చి పెంచితిని ♦ గన్నకుమారుని కన్నమిన్నగన్॥

దుష్ట—(తనలో) ఓహో ! యిదేమో చిత్రముగానున్నది. వాఁడేనా ! ఏమి (పైకి) రాజా ! అప్పటికీబాలుం డెంతవయస్సుగలవాఁడు ?

కుళిం—అప్పటికైదేండ్ల వాఁడుగనున్నవాఁడు. అతికోమలశరీరుండు. కోత బాధకు యేడిచి యేడిచి పడియుండె. నేనుగాంచి తత్క్షణం బట్టితెచ్చి పెంచితిని.

దుష్ట—మంచిది. ఇదియా వీనివృత్తాంతము ! (పశ్చాత్తాపముతో తనలో) అహా యెంతటిమఱపుకల్గె. ఇప్పుడేమిసేయుదును ! వ్యర్థమాయెనుగదా !

కుళిం—స్వామీ ! తాము మఱచినట్లు పశ్చాత్తాపమొందుచున్నారు. అది యెంతటిముఖ్యాంశమోకదా ! నెలవిచ్చినచోఁ మాచేతనైన దానినెఱవేర్ప సాధ్యులము.

దుష్ట—ముఖ్యమైనదే ! యల్పకార్యమేయయినను శ్రమయియ్యవలసి వచ్చునని సంశయించుచున్నాఁడను. నీవంటివాఁడును బనిలేదు.

కుళిం—దేవా ! తమకట్టి సందియమేల ? కార్యముం జెప్పి నిర్వాహకత్వంబునకును దామె నియోగింపఁ గర్తలు.

దుష్ట—అట్లయినఁజెప్పెదను.

తే॥ గీ॥ కుంతలపురంబునందు నా ♦ కొమరుఁడైన
మదనుతో ముఖ్యమగు వర్తమానమొకటి

చెప్పుమఱచితిఁగాననే ♦ నిప్పుడొక్క
కమ్మనిడెదను బంపుమీ ♦ కడురయమున.

మఱియు-నాయుత్తరము మిగుల సత్వరంబునఁ జేరవలయు. నిందుల కవక్రవిక్రముం
డగు నీకుమారుండే తగినవాఁడని తోఁచెడిని.

కుళిం——శీఘ్రము ! ఇందులకు తామింత సందేహింపవలయునా ! తాము యుత్తర
రమును వ్రాయుఁడు నేను వీనిని పైనికుని గావించుకొని వచ్చెదను. (అని ని
ష్క్రమించుట)

దుష్ట——(స్వగతము. తనలో)

ఉ॥ అక్కట యెంతకృత్రిమము ♦ నైననొనర్తురు భృత్యులేనిదాన్
మక్కటికంబుజూడక మ ♦ హాటవిలోపలఁ బాలుఁజంపనే
నొక్కటఁజెప్పిపంపఁ జని ♦ యోజనలేమియుచేసి కాలివ్రే
లొక్కటి తెచ్చిచూపినను ♦ నుబ్బఁగజేసిరి యిట్టిదుష్టులో॥

అక్కటా ! యీటక్కరి తలారులు నన్నెంత మోసపుచ్చిరి. ఛీ ! దుష్టులారా మీ
మోముచూడరాదు; మీరునాకు ముఖ్యులనియును నాయాజ్ఞచే యిదివరకెం
తటి పనులో చేసియుంటిరనియును నమ్మి బాలుని చంపిరండని నేను బహు
నమ్మకములు చెప్పి వనములో యేమో దురాలోచనచేసి కాలువ్రేలు మాత్ర
ము కోసితెచ్చి చూపితిరా ! కానిండు. దీనికైన మీకుబుద్ధిపుట్టెనా ! దీనివెను
క మీ బ్రతుకునూ చూచెదను. ఏమియోజన జేసితిరి ! బాలుఁడు వేడుకొన
కనికరించితిరా ! ఎట్టివానిని కనికరింపవలయు. ఇప్పుడుకనికరింతురు? రం
డు నేనుబుద్ధిబలాఢ్యుడను కావున నిర్వహించుకొనుచుంటిని. కానిచో యే
మి కావలయు ! (అని యుత్తరమువ్రాయుచు) నీమృతికే కాఁబోలు నాకిట్టి
యూహ తట్టినది. ఇక్కిదియేసరియైనది. (అని చూచుకొని మడిచియుంచుట)

కుళిం. } కుళిం——ప్రవేశింతురు——(కుమారునిచూపి) మంత్రివర్యా ! ఈదేనాకు
చంద్రి } మారుని వాయువేగంబునచనుదెంచు నుత్తమాశ్వముపై ప్రయాణముచేసి
తెచ్చితిని.

దుష్ట——(చంద్రహాసుని చెయ్యిపట్టుకొని) నాయనా! చంద్రహాసా ! ఈయుత్తర
మును గొనుము.

చ॥ సదమల భూషణంబునకుఁ ♦ జక్కనిరత్నము రీతిశుక్తికిం
పొదవెడు ముత్యమట్లు విపు ♦ లోజ్వలుఁడైన కుళిందమౌళికిన్

మదమిడు వట్టిపై తగిన ♦ పుణ్యుఁడవీవు మదాత్మజాతుఁడా
మదనునకిమ్మదీని బవ ♦ మాన సమానత నేగి వేగరమే॥

క॥ నీవతి సుకుమారుండవు
కావుననిన్నిట్లు పంపఁ ♦ గావలసెనటం
చేవంత నెందుచుంటిని
కేవిధమును దోఁచదయ్యె ♦ నిపుడుకుమారా॥

చంద్ర—(ఉత్తరమును తీసికొని) స్వామీ! మీరిట్టి యల్పకార్యమునకై యింతగా చెప్పవలయునా? యిదియన నాకొక తృణప్రాయము గాదా!

**మధురగతి రగడ, పూరి కళ్యాణిరాగము, ఆటతాళము.**

ఈపనియనఁగా నా ♦ కెంతటి కార్యము
మీపురికీక్షణ ♦ మేచనుదెంచెద
దేవరవారొక ♦ దీనునికైవడి
నీవిధమున నెల ♦ వీయఁగ నేటికి॥

పోయివచ్చెదను నెలవొసంగుఁడు. (అని మొక్కుట)

దుష్ట—కళ్యాణమస్తు. తండ్రీ! నీవింతటిసామర్థ్యుండవు. కావున నే నేనునిన్నే కోరితిని.

చంద్ర—జనకా! పుత్రునకు నెలవా?

కుళిం—మంచిది తండ్రీ! (తనలో నేనుకొంతదూరము సాగనంపి వచ్చెదను)

మంత్రిసత్తమా! నాసుతిని బంపివచ్చెదను.

దుష్ట—మంచిది.

(తండ్రికుమారుఁడు నిష్క్రమించుట)

దుష్ట—(తనలో) భేషు! ఇప్పుడుకదా సరియైనపని జేసితిని. ఇప్పుడెట్లు తప్పించుకొనగలడో చూతము. వెళ్ళియొకజాము కాదా! ఇప్పటికి జాము కాదా! ఇప్పటికిని జేరియుండఁడా! యింతయేల! యింకొక జామునకైన మృత్యుఁడగును గాని మరలి రాఁగలఁడా? కావున మనమిఁక గావలసినపని నాలోచింపవలయును. ఏమిచేయుదము (ఆలోచించి) సరే యీకుళిందునేదో యుపమనుభార్యాసహితముగా, బురమువెడలించి మఱియొకరాజ్యకడ చేరఁబెట్టించి వీని యిష్టసంపదలన్నియుఁ జూరగొని యీపురమునకు వేరొకని పతినిగావించి మఱి పోవలయు. దీనివలన వీనికిశిక్ష సరిపోవును. కాకున్న తన యిచ్చవచ్చినవానినెల్లఁ దెచ్చి పెంచుటయే వీనిపని కాఁబోలు. అరణ్యములోని బాలునితో వీని కేమిపని? తడవుసేయరాదు. (అని పోవుట)



శ్రీ

# శృంగార చంద్రహాసీయము.

## (చతుర్థాంకము.)

### ప్రథమరంగము.

(చూళిక) (చంద్రహాసుఁడు వనములో ప్రవేశము)

---

చంద్ర—(తెరలో)

మ॥ ఒడయం డేలు పురంబుఁ జేరకుతుకం ♦ బొప్పారనన్ బూనీని
యొడలెల్లంబడలంగఁ బర్వులిడ న ♦ య్యో యత్తమార్గంబనీ
యడుగుల్ తొట్రుపడంగసాగ నురుగ ♦ త్యంతంబు రాఁజొచ్చెనే
యొడలేనట్టి ప్రయాసగ్లానిఁ కన ♦ న్నే తీరునన్ జేర్చెదో॥

(ప్రవేశించి విసుకుపడుచు) ఇస్సీ! మంత్రివల్లభుని యుత్తరమున తడవగుచున్నదిగదా.

ఉ॥ ఇప్పటి కెన్ని యామడలొ ♦ యేనరుదెంచితి నింతదాఁక నా
కప్పురి దూరమింతయని ♦ యైనను జెప్పెడువారు లేరు పెక్
దప్పిని నాల్కయెండెనిఁకఁ ♦ దాళఁగలేని ప్రయాసమయ్యెనే
నిప్పగిదిన్ జనంగఁగల ♦ నే క్షణమైనను నిల్వకుండఁగన్॥

ఆనుహామపాఁడు పురమింత దవ్వనఁగలదనియైనను జెప్పఁడాయెఁగదా.

తే॥ గీ॥ వారువంబును నురుగులు ♦ వారనరికి
యెక్కుడు ప్రయాసమొందిన ♦ దింతనైన
నించుకేనియు శ్రమదీర ♦ నీయకుండ
కష్టపెట్టుటధర్మంబు ♦ కాదు కావె.

కావున ముందేదియో వృక్షసముదాయము గనుపట్టుచున్నది. వేవేగం జని కొంచె మునిలిచి పోయెదను. (అని చనుచుఁ జెట్లనీడకుఁ జొచ్చుచు)

తే॥ గీ॥ వేదకాక వెన్నెధాన ము ♦ బ్బనవిధాన
నాకు శారీరతాపమం ♦ తయును దీర

శీతలానిలయుతమాచుఁ ♦ బ్రీతినిగద
మంజులవనంబునాకు సం ♦ ప్రాప్తమయ్యె.

ఆహా! ఏమి! యీ వనము మనోహరము! సర్వమంగళాభి శోభితంబై కనుపించుచున్నది. ఇదియేదియో శృంగారారామము కాఁబోలు. ఇప్పటికే దేహతాపము కొంత బాసినది. (అని నలుదెసలు పరికించుచు)

(అనుమానము)

సీ॥ దీనినిల్చినమాత్రఁ ♦ దీరదే నిప్పనఁదగిలిన దేహసం ♦ తాపమెల్ల
దీనిఁజేరొక్కనినంతఁ ♦ దీరదే వేసవిఁ బడివచ్చువాని పి ♦ పాసయెల్ల
దీనిఁదలంచినఁ ♦ దీరదే ఫలభుక్తి కర్థియావాని పే ♦ రాసయెల్ల
దీనివిన్నంతనె ♦ తీరదే తరుణుల కడ లేనిమదన వి ♦ కారమెల్ల
తే॥ గీ॥ అహహ దినదినమీవని ♦ కరుగుదెంచి
యనుపమానసుఖంబుల ♦ ననుభవించు
నట్టియావనఘనుల పు ♦ ణ్యంబునెన్నఁ
దరముగునె యెంతవారికి ♦ ధరణియందు.

నాకిప్పటికి దేహపరితాపము తీరినది కాని దాహపరితాపము మాత్రము దీర్చుకొనవలయు. ఇది శృంగారవనముగదా! ఇందేదైన పానీయనిలయముండదా! పరికించెద. (అని కొంచెముదూరముచూచి) ఆహా! యేమినాభాగ్యము! కన్నులపండువు గావించుచు మిన్నయగు కాసారలక్ష్మి నాకోరికదీర్పఁ బ్రసన్నంబైనది.

(సంభ్రమము)

ఉ॥ కమ్మనిమంజరుల్ మిగులఁగల్గిన ♦ పూబొదరిండ్లు పిండ్లు గాఁ
గమ్మికమీఱి తీరములఁ ♦ గ్రాలగుణత్రయ యుక్తమైనమే
లైమ్మెరలింపునింపఁగడుఁ ♦ దియ్యనివారమొసంగు దీననే
సమ్మదమొప్ప నీరుగొని ♦ చల్లగనిచ్చట విశ్రమించెదన్॥

(నీరుత్రాగుచుఁ దనలో)

సీ॥ మునుసురాసురలకు ♦ మోహినిపంచియీ
యఁగనందుమిగిలిన ♦ యమృతమేమొ।
"ఆహా" క్షీరముల్ కొలనుగాఁ ♦ జేసియేర్పఱుపనం
దలరియుండిన పాల ♦ తొలకులేమొ॥

"బలే" ఇంచుగానుగల నా ♦ డించి పాకమొనర్చ
టకునించినట్టి పా ♦ నకమయే మొ!

"బేషు" దివినెల్లఁ బారి పృ ♦ ధ్వీస్థలికేతెంచి
వ్రాలుమందాకినీ ♦ గంగయే మొ॥

తే॥ గీ॥ కాకసామాన్యమగు నుద ♦ కంబులైన
నిట్టిమాధుర్య ముండునే ♦ యెచటనేని
యెంతద్రావిన నాకిసు ♦ మంతయైనఁ
దనివిదీరది దెంతచి ♦ త్రంబొసుమ్ము.

ఇచ్చట మిక్కిలి చల్లని పొన్నగున్నయున్నది. దీనిక్రింద కొంచెము నిలిచెద. పాపము! హయంబును మిగుల ప్రయాసమొందినది. దీనిని నీరుద్రావించి కొంచెము సేదదీర్చుకొననిచ్చెదను. (అని గుఱ్ఱమును విడుచుచు)

మ॥ హయరాజంబ! పథశ్రమంబుబెడబా ♦ యంగన్ సుధాతుల్యమై
స్వయదూరంబగు యీపయోనిచయమి ♦ చ్చంగ్రోలి దూర్వాళిని
గ్భయమొప్పన్ గడుపాఱమేసి కుసుమ ♦ ప్రాచుర్యమైచాలవి
స్మయమా యీవనమందుఁ గొంతవడి సం ♦ చారంబు గావింపుమా॥

(అని గుఱ్ఱమునువిడిచి నీడనుగూర్చుండి)
ఆహా! యేమి యీ మలయానిలము.

తే॥ గీ॥ చందనముఁబూసి ముత్యాల ♦ సరములేసి
చామరంబుల వీచెడు ♦ సరణిమంద
గతినిసోఁకెడి మలయమా ♦ రుతముచూవె
విందులిడవచ్చుచుట్టంబు ♦ విధముతోఁప.

ఇంతియే కాదు.

సీ॥ అమృతతుల్యంబులౌ ♦ విమలాంబువులుగ్రోలఁ గాయంబునకునెంత ♦ హాయిగల్గె
పులకలెత్తఁగనిదే ♦ పుత్తెంచెఁదెమ్మెరల్ తనువాననెంతమో ♦ దంబుగల్గె
ఈచల్వనీడ నె ♦ క్కించుకనిల్వఁగా నెడలేనిసుఖమునా ♦ కెంతగల్గె
ప్రీతిగూర్చెడుపికి ♦ గీతముల్ విననాకు కూరుకులెంతయొ ♦ ముక్కుడుగఁగల్గె॥

తే॥ గీ॥ వేసటలుదీరనిపుడుంత ♦ విశ్రమించి
యిందుఁగల చిద్విలాసంబు ♦ లెల్లఁజూడ

మనము చిగురెత్తుచున్నది మాక్కి నేను
దొదరియుటనుండ ముందేమి ♦ వాదము నెకొ్క

కొంచెము పరుండెద (నని పండుకొనఁబోవుచు తనలో)

తే॥ గీ॥ హయమునఁ బ్రయాణమైవేగ ♦ నరుగుదెంచి
యలసినాఁడఁబరుండిన ♦ నధికమైన
నిద్రపట్టునె యేమొకో ♦ నేత్రములకుఁ
గూరుకులువచ్చె నివియెజో ♦ కొట్టినట్లు.

ఇంచుకైనఁ గూర్చుండఁజాలకున్నాఁడను. కొంచెము సేపువరుండెద. దీననేమి ప్రమాదముగల్గు! కల్గదు. ఇపుడేబయలుదేరెదను. (అని పరుంచి నిద్రపోవుట)

## ద్వితీయరంగము.

వనములో విషయ చెలికత్తె ప్రవేశము.

### కీర్తన. కమాచిరాగము—రూపకతాళము.

విషయ—

ఈసుందరోద్యానము । నింపుసొంపు దగినది ॥ ఈ ॥
భాసురకుధు । మాసమున వి । లాసిములనుభాసిల్లెడు॥నీసుం॥
కలకలమని । కలకోకిల । కలరావముసల లరారెడు॥ నీసుం॥

విష—సఖీ! కోమలాంగీ! మనమీవేళ రమణీయంబులగు పుష్పంబులంగోసి పుష్పింపని తరువులకు దోహదంబులుజేసి నూతనంబులగు నాలవాలంబులకు మొలకలునాటి వేగిరంబునఁ జనుదెంచెదము. నీవీతరువులకు దోహదంబులు సేయుము. నేనీ నికుంజంబుల పువ్వులు గోసెద.

చెలి—అమ్మా! నేనెన్నఁడును దోహదంబులు చేసినదానను గాను. నీతోఁబుష్పంబుల గోయుచువచ్చెద.

విష—మంచిది నాతోరమ్ము (అని చేయిపట్టితీసికొనిపెళ్ళుచు) చెలీ! యిదివీక్షింపుము.

చ॥ నిరుపమరత్నయుక్తరమ ♦ ణీయవిభూషణ భూషితాంగియై
హరునినిజాంగసీమ నల ♦ రారెడు పర్వతజాతభాతినీ
తరువునకుం బెనంగొని ని ♦ తాంతలతాంత విభాసమానమై
పఁగెడుపువ్వుదీఁగె విభ ♦ వంబునుజూడుము చిత్రముయ్యెడిక॥

చెలి—అమ్మా! విషయాదేవీ! ఆపువ్వుదీగ సోయగము మిగుల రమణీయముగ నుండు టయే కాక నీభావంబునకు దాంపత్య విలాసంబును దగులఁజేసినది. ఇది యెంతయు నీకు శుభంబేకదా.

విష.—ఏమీ! చెలీ! నిఅవివాహాత్రగు నన్ను మేలమాడెదవు. అట్టి హేళనంబు లుమాని పువ్వులు గోయుము.

చెలి—పువ్వులుగోయుచునే యుంటినిగదా! దేవీ యిదేమిచిత్రము!

మత్తకోకిల॥ ఆమహీజమునందుఁ గన్పడు ♦ నగ్నికణములుచూచితే
నామనంబున భీతిగల్గెను ♦ నన్నుఁగావుముకోమలీ॥

విష—భీతియేల?

కోమలాంగి పలాశపుష్పపు ♦ గుంపులల్లవె కాంచుమా
నీమనంబునఁ జంకకిచ్చట ♦ నిప్పులుండుననచ్చెలీ॥

చెలి—అట్లయిన నాపాంతలకుంజని తత్త్రద్రమణీయంబులఁ గనుంగొని యాకుసుమం బులెల్లఁ గోసికొని తెత్తును.

విష— తే॥ గీ॥ క్షితిని గృహమేధి కగుణులా ♦ సుతులుగల్గి
నిష్ఫలప్రదులయినట్లు ♦ నీరజాక్షి
తావిలేనట్టి వగుచునీ ♦ తరువులందుఁ
బూచివ్యర్థంబులయ్యెనీ ♦ పువ్వులేల.

ఉ॥ అల్లదె చంపకంపుకురు ♦ వల్లదె చందనభూమిజంబుఁ దే
న్నల్లడ పల్లవంబులదృ ♦ గ్గంచితమై తగుపొన్నగున్నరం
జిల్లుచునున్నదీ విటకుఁ ♦ జెచ్చెరనేగి సుమవ్రజంబులన్
గొల్లగఁగోసి తెమ్మిటు చ ♦ కోరనిభాక్షి నిమేషమాత్రలోన్॥

చెలి—చిత్తము! అట్లె తెచ్చెదను. (అని చనుట)

విష—తనలో.

సీ॥ ఈపూలెకావె ర ♦ తీశుబాణంబులై యిందీవరాక్షుల ♦ నేచునందు
ఈయళినికురుంభి ♦ మేకావెమరువింటినారియై సుతులతోఁ ♦ బోరునందు
ఈశుకశారిక ♦ లేకావె మన్మథుదళములై తరుణులఁ ♦ గలఁచునందు
ఈమలయానిలం ♦ బేకాదె స్మరునకుసాయమై సతిబల్మి ♦ దీయునందు॥

తే॥ గీ॥ ఈడఁగలచిత్రములనెల్లఁ ♦ జూడఁజూడ
నామచిత్తంబునందు విం ♦ తలగునట్టి
తలపులెన్నియొ చాలగాఁ ♦ గలుగుచుండె.
కానసైతిని దీనికిఁ ♦ గారణంబు.

నేనొంటరి పాటుననుండుటచేఁ గాఁబోలు ! నాకేమియుఁ దోఁచకున్నది. ఇంతకు నెచ్చెలి రాదయ్యె. ఇంకను దోహదము చేయవలసియుండెనుగదా. (అని యోజించుట)

చెలి—అమ్మా !

తే॥ గీ॥ ఇవిగొ గాంచుము మొల్లలో ♦ యిందువదన
ఇవిగొ సంపెంగపువ్వులు ♦ కువలయాక్షి
ఇవిగొ జాజులు తిలకింపు ♦ మిగురుబోడి
తెచ్చితినినెల్ల కుసుమముల్ ♦ తృప్తిదీఱ.

విమ—(తీసికొని) మిక్కిలి సంతసించితిని. ఇవిమొల్లను నామనసుదీర సరులుకట్టింప వలయును. దోహద మట్లైయున్నది. సేయుదమురమ్మా ! కొమ్మా ! (అని చూపుచు)

విమ—

తరల తిలకమియ్యది పూచునివ్వడ ♦ తిప్రియంబునఁజూడుమా
కలికిప్రేంకణ మిల్లిదేకని ♦ గౌరవంబునఁ బాడుమా
కలువకంటిరో కుర్వకంబిది ♦ కౌఁగిలింపవె భామినీ
జలజలోచన పొన్నచెట్టిది ♦ చాలనవ్వవె మానినీ॥

క॥ లేమావి దీనితట్టుము
లేమాసంపెంగనెదిగ్చి ♦ లేమావకుళల
నీమదిరోయగ నుమియుము
కోమలికంకేళిఁదన్ను ♦ గొబ్బునఁబాయన్.

చెలి—తల్లీ ! నీవిప్పుడుచెప్పినచొప్పెల్లఁ దెల్లంబయ్యెఁగాని నాకొకసంశయము వొడమె. ఏమన: మనముపిన్ననాటనుండియు పసిపిల్లలవలెఁ బెంచుచున్న తరువులలోనఁ గొన్నిటిని ప్రేమించుటయును, కొన్నిటిని గౌరవించుటయును, కొన్నిటిని రోయుటయును, కొన్నిటిని నుమియుటయును, కొన్నిటిని దన్నుట

యును, కొన్నిటిని దట్టుటయును, నుపదేశించితివి. వీనియెడ నిట్టి పక్షపాత ముంచఁదగవా మగువా.

విష—చెలీ! నీవెంతవెఱ్ఱిదానవు! తరువులన్నియును నాకును సమానములే వాని యెడనాకును వాత్సల్యము గలదు. గృహమేధికి తానుగన్న బిడ్డలందఱియెడఁ గనికరముండినను వారిలో సుకరంబుగ వినువారికి సుకరంబుగను. దుష్కరంబుగవినువారికి దుష్కరంబుగను సామదానభేద దండోపాయంబుల విద్దెల గఱపుచందంబున మన మాయాతరువులకు నాయస్వాభావికంబులంబట్టి దోహదంబు చేసినఁగాని పుష్పింపవు. కావున నీవీక్రియలగల తీవలకు దోహదంబులు చేయుచుండుము. నేను మనకేళీకాకాసారంబునకుంజని నీరువట్టుదీర్చుకొని వచ్చెదను.

చెలి—చిత్తము! ఆలాగే సేయుచుండెదను. నీవచ్చటికేగి వెచ్చెరవిచ్చేయుము.

(అని యిరువురును నిష్క్రమించుట)

## తృతీయరంగము.

(విషయ దూరమునుండి పరుండియున్న చంద్రహాసుని గనుట)

విష—(ప్రవేశించి తనలో) భయముతో! ఎవఁడో యీచెట్టుక్రిందఁ బరుండియున్నవాఁడు! చోరుఁడేమోకదా! నేనొంటరిగా వచ్చితినే (ధైర్యముతో) ఇచ్చటనేదో యాత్రమాశ్వమొకటి యున్నది. చోరుండైనచో యాత్రమాశ్వ మేలయుండును! వీఁడెవఁడో బాటసారి కాఁబోలు! మార్గాయాసంబున నిందు విశ్రమించి యున్నవాఁడు. అట్లయిన నేమిజంకు! ఆహా! వీనిరూపరేఖావిలాసము దూరముననే యింతసొంపుగనున్నది. దాపునకుంజనిన యెట్లుండునో చూతము. మనకేల (అని ముందు పోబోయి వెనకదీయుట) నేనా నిర్వాహాను. నాకొకసిజోలియేల! వీఁడు నిద్రించుచున్నట్లున్నది. ఇంచుక చూచిన నేమిదోషము! వీఁడెవ్వఁడో మెల్లన వీక్షించెద (అనిచూచి)

### కీర్తన. బేహాగురాగము—ఆదితాళము.

ఎవరీశుభాంగుఁడు ♦ నవమోహనాంగుఁడే॥ యెవరీ॥
ప్రవిమలతేజము ♦ భాసిల్లుచున్నది॥ యెవరీ॥
కువలయ మిత్రుని ♦ గోడిగ మాడుచు ♦ నవిరళమగుకళ నమరెడుమో
మువాడెవడీ। శుభాంగుఁడు॥

ఉ॥ ఈనగు మోముతీరు శర ♦ దిందునిచందము గేరు శ్రీలనీ
వీనులు మీఱఁ గన్నులర ♦ విందములై పొలుపారు బాహువుల్
జానువులంటఁ గోరుఁ గడుఁ ♦ జక్కని యీ సుకుమారుఁ జూడ నా
మానసజాతు సౌరుతగు ♦ మానవధీరుఁ డితం డెవండొకో॥

ఇతఁడెవ్వఁడైయుండును! ఇటకు రానేల! వచ్చెబో యింతటి గాఢసుప్తిఁ జెందనేల! దీనికేమో ముఖ్యమగు కారణముండును. గాన వీనివృత్తాంతము సాంతముగా నరయవలయు. (అని దగ్గరకు బోయి చూచుచు) వీనికులమెద్దియై యుండును? చూడఁజూడ క్షత్రియకుమారునకుంగల చిన్నెలెన్నియో మిన్నగఁ జెన్నలరారుచున్నవి. ఆహా! యితండెంతటి మహాపురుషుండు. వీనికరములందును పాదములందును చక్రవర్తికిఁగల రేఖలెన్నియో యున్నవి. అట్లయిన నితండు దేశంబులకు రారాజు గాక యిటుబడియుండుట కేమికతము? శాస్త్రములు వ్యర్థములా! కావు కావు. వానిప్రభావమింకను వీనిపై బ్రాప్తించలేదు కాబోలు. ఏమి వీనిసౌందర్య లావణ్యము? నాకొక సామాన్య మానవుఁడుగ గనుపించుటలేదు. ఎవరో దివ్యపురుషుండై యుండవలయు?

సీ॥ రతినాథుఁడో కాఁడు ♦ రతినాథుఁడైన నయ్యలరువిల్లు నుజవు ♦ టమ్ములేవి
నలకూబరుఁడొ కాఁడు ♦ నలకూబరుండైన రహిఁ గూడి పాయని ♦ రంభయేది
చందురుండో కాఁడు ♦ చందురుండైనచోఁ దనువున నేణలాం ♦ ఛనమదేది
ఇంద్రనందనుఁడొ కాఁ ♦ డింద్రనందనుఁడైన ననిమిషత్వము కన్ను ♦ లందు నేది॥
తే॥ గీ॥ అలరువిలుదీసి రంభను ♦ దోలఁగఁ జేసి
కందుకడనుంచి యమినిష ♦ గతినడంచి
యవనికై వచ్చెని నల్వు ♦ రందునొకఁడు
గాక నృపుఁడైన నీసోయ ♦ గంబుగలదె.

అదియును గాదు. అనలువురి యందొకఁడైనచో నిట్లు నిద్రించుట కేమికతము! కాదు మానవోత్తముఁడే యయియుండవలయును!

క॥ ఈతని నెమ్మోమునియెడు
శీతకరునకంద మొందు ♦ చిఱునగవెంతే
ఖ్యాతివహించెడు వెన్నెల
యైతనరును గాదెనిశ్చ ♦ యంబుగఁ గంటే.

(రాగమాలిక.)

సీ॥ శ్రీకారములఁగల్గు ♦ శృంగారమిరుదెసల్ వెలసినగతివీని ♦ వీనులలరె
హనుమంతుతోడఁబో ♦ రాటఁగల్గినయంత పుష్టిమీఱినయట్టి ♦ భుజములమరె
సింహేంద్రమధ్యము ♦ స్థితిఁబురుడించుచు మానితంబగువీని ♦ కౌనుతనరె
దర్బారు సేయఁగాఁ ♦ దగియున్నరారాజు భాసురంబైన వి ♦ లాసమొనరె॥

తే॥ గీ॥ మలయమారుతములు వీచు ♦ మాడ్కివీని
మేనిసౌరభవీచికల్ ♦ మొలఁగుచుండె
ధరను గాంభోజముఖరభూ ♦ దయితులెంద
ఱైనివీనికి సరివత్తు ♦ రేతలంప.

వీనివిలాస మెంతని వర్ణింపఁగలను? వీనినిజూచినది మొదలు నాచిత్తమ్ము చిగురొత్తుచున్నది. వీనివృత్తాంత మేమైయుండును? మనకేల పోవుదమన్న మనస్కరింపకున్నది. ఇచ్చట దూతికయైన లేదయ్యెఁగదా! ఎయ్యదియు నేనేయూహించుకొనవలయును. ఈయుత్తమాశ్వమొకటి కలదు. దీనిపూర్వపుణ్యంబునఁగాఁబోలు నింతటి దివ్యసుందరమూర్తిని మోయనంతటి భాగ్యము లభించినది. దీనినైనను విచారించెదను.

తే॥ గీ॥ నిరుపమానంబులగునడల్ ♦ నేర్చినట్టి
యుత్తమాశ్వమ? యీపురు ♦ షోత్తముండు

ఆహా! నేనెంతవెఱ్ఱిదానను. మనుజుల సందియములు మృగములా తీర్చునవి?

చేలయుల్లము! తత్తర ♦ మేలనీకు
నిలువరించినఁదెలియవే ♦ నిజములెల్ల.

ఏవిషయమును నేనే గ్రహించుకొనవలయునుగాని నాకిచట సహాయులెవరు.

తే॥ గీ॥ ఈతనూవిలాస ♦ మెచ్చటఁగనలేను
చూడఁజూడదమదికి ♦ సొంపుగల్గు
వాడినట్టిమోము ♦ పయఁజిఱుచెమటలు
గ్రమ్మఁదడువనేమి ♦ కలుగునొకో.

అక్కటా పాపము! చెమటలు తుడిచినచో బాగైయుండునుగదా! వీనికిచ్చట నుపచరించువారెవరు? నేనుండియుఁ బ్రయోజనమేమి! నేనే మెల్లనఁదడియారవి

సరుచు నిదుర మేల్కొంచకుండఁ జేసి యోజించుచుండెదను! (అని కూర్చుండి విసరుచు)

మ॥ భళిరే యీశశిగేరు మోము సొబగు ♦ ప్పా చెక్కుటద్దాలమేల్
చెలువల్ మీఱెడు నీసుధాధరరుచుల్ ♦ భేషీసరోజంబులన్
దోలఁగం ద్రోయఁగ జాలుకన్నుఁగవ ము ♦ ద్దుల్ గారు నీవంటిచాల్
గలవాఁడీతని సాటియొక్కఁడయినన్ ♦ గన్పట్టునే యెచ్చటన్॥

సీ॥ ఈ మోడ్పుకను విప్పి ♦ యింపారఁగనుఁగొన్నఁ
దనరెడు హాయెయలునేం ♦ తనఁగవచ్చు।
ఈ వాతెరఁ గదల్చి ♦ యిసుమంత మాటాడ
ననువగు తీవినేం ♦ తనగవచ్చు।
ఈ లలితంపు పల్ ♦ చాలుగన్పడ నవ్వ
నధికమౌ సొబగు నేం ♦ తనగవచ్చు।
తే॥ గీ॥ అరరె యీసుకుమారుద ♦ యాప్రిసారు
విదితశృంగారు విరహిణీ ♦ హృదయచోరు
నెక్కసెక్కెములను బల్క ♦ రింపఁగల్గు
నట్టిసక్రియ దెవొ జన్మ ♦ మరయ భువిని.

ఇంతయేల!

చ॥ చతురతమీఱఁగా నితనిఁ ♦ జాలసవర్యలఁ దృప్తిఁ జేసి మా
నితముగు నట్టి మచ్చటల ♦ నేర్పుగ సల్పి కటాక్షవీక్షలన్
గుతుకమునం గ్రహింపఁగల ♦ కోమలి దే ఘనభాగ్యమౌను గా
కితరుల దేటి జన్మము ము ♦ హిన్ మహిమంబన రాదె చూడఁగన్॥

అయ్యయో! నేనెంతయారడిల్లిననేమి ప్రయోజనము? ఈతని కృపారసమను భవించు భాగ్యశాలిని యెవరోకదా! ఏపుణ్యురాలి కోడం ట్రికంబున నీతని తలిదండ్రులు పరితృప్తులగుచుండిరోకదా! ఈ వనవిహారంబులును, పుష్పహారంబులును, అట్టి సౌభాగ్యవతులకుఁ గాక నావంటి నిర్భాగ్యురాలికేల. కాల్పనే? ఏమి నాహృదయము వీనినిగూర్చి మృగతృష్ణలోని నీరున కాసించినట్లుగా నాసించుచున్నది. ఈ దివ్యమంగళాంగుఁడేడ నాయదృష్టమేడ! నా కా యట్టి పొడుములు! నాలో నేననుకొనిన - ననుకొనవలసినదే. విను వారును లేరు

తీర్చువారును లేరు. నిక్కముగా వీఁడొక క్షత్రియకుమారుఁడే! వీనివృత్తాంతమెట్లున్నను వివాహియో నిర్వివాహియో అదియైనఁ బరికించెదను. అదియెట్లు?

తే॥ గీ॥ అలసి గాఢసుప్తి ♦ నందిదేహమెఱుంగ
కున్నవాఁడు వీని ♦ మిన్నయైన
కవచమునుదొలంగఁ ♦ గాఁజేసి ఱందెంబొ
నేఁ బరీక్షసేతు ♦ నేర్పుమీఱ.

అట్లొనరింప నప్రమాదము గల్గునేమోకదా! కల్గనిమ్ము! ఇతఁడు నన్నురక్షించినను మేలే. శిక్షించినను మేలే! ఎట్లయిన సాహసించెదను. (అని కవచమునుదీసి చూచి) భళీ! ఇతఁడింకను బ్రహ్మచర్యమునందే యున్నవాఁడు. ఏమి నాభాగ్యము! ఓహో! యీకవచాంతరమున నేదోయుత్తరమున్నది. తీసి చూతునా! దీనిపై మాజనకుని చేవ్రాలు కలదే! చేవ్రాలే కాదు ముద్రయుఁగలదు. ఇది నాసోదరునికి వ్రాసినాఁడు. ఈతనికి మాతండ్రి యెట్లులభించె! ఇతఁడు మనయింటికేఁ బోవునా! నాకు స్వాతంత్ర్యము గు వసతియే కుదిరినది. కానిమ్ము! దీనివిచ్చి చదివినఁ గొంతవఱకైన వీనివిషయము తెలియునేమో! చూచి నాయొద్దఁగల నాజనకుని ముద్దుటుంగరముచే నెప్పటియట్లు ముద్రించి పెట్టెదను. (అని విప్పిచదువుట)

(ఉత్తరము)

సీ॥ శ్రీరస్తు మత్సుత ♦ మారుఁడౌ మదనున కఖిలశుభంబులు ♦ నలరుగాత
ఉభయకుశలోపరి
ఈకమ్మ తెచ్చి నీ♦కిడు చంద్రహాసాఖ్యుఁ డితఁడు నిజముగాన ♦ హితుఁడు నాకు
నాపాత్తుఁ గైకొన ♦ నాసఁ జెందినవాఁడు నఖిలరాజ్యమువడ ♦ యఁగలవాఁడు
వీనియాపవరూప ♦ విధమెల్ల వీక్షించి నాయభిప్రాయము ♦ తయఁగ్రహించి॥

తే॥ గీ॥ ఈతఁడెవనిసుతుఁడు ♦ హీనుఁడా యధికుఁడా
యబలుఁడా మహాబ ♦ లాన్వితుండ
యజ్ఞుఁడా వివేకి ♦ యాయనిచూడక
వీని కొసఁగు విషము ♦ విషమునిమ్ము.

ఇట్లు భవదీయజనకుఁడు
దుష్టబుద్ధి

ఆహా! యీదేమో శ్లేషముగాను, అర్థగంభీరముగాను భావగర్భితముగాను వ్రాసినాఁడు. తిరిగి చదివెదను. (అని తిరిగిచదివి) యిందేమో పరుషోక్తులు కనుపట్టుచున్నవి. నాచిత్తభ్రమ కాదుకదా! యేదీచూతము. "ఇతఁడునిజముగా నహితుఁడునాఁడు?" యీసరసుఁడు మాజనకు నహితుఁడా? ఇతఁడేమిచేసె! అహితుండనుటకుఁ గతంబెయ్యది! ఇంక "వీని శాతకంబ-విషమునిమ్ము" ఇదియొక పిడుగువార్తగానున్నది. "విషమునిమ్ము" (అని చెవులుమూసికొని) అక్కటా యెంతటికఠిన శాసనము. ఇతనిని మోసపుచ్చి పంపెను గాఁబోలు.

### కీర్తన. నాదనామక్రియరాగము-రూపకము.

అకటా నాజనకుఁడు వ్రాసినయీ
వికటోక్తులుగనుఁగొనఁగను మనము కనలె ॥నకటా॥
సకలంబును దెలిసిన తండ్రికినీ
యకలంకుండు "అహితుండెటులాయె నొకో" ॥అకటా॥
ఈతఁడెట్టివాఁడో యని నీమది నించుకైనశంక సేయక
చేతులారనీసుగుణుని ఘాతజేయ నీతనయుని
ప్రీతిగల్గు వచనములను
విషము నొసంగుమని లిఖించె ॥నకటా॥

ఇస్సి! నాదుఃదృష్టమిట్లై మొదలనుండి వచ్చుచున్నది. వీనిని జూచినది మొదలు నేనొక కనకగిరిని జూచినట్లుబ్బుచున్నదానను. వీనికిట్టి పాటువాటిల్లును గాఁబోలు? తండ్రీ! నీకేల వీనిపై నిట్టితలంపుగలిగె?

శా॥ ఈలావణ్యము నీసురూపవిభవం ♦ బీయొద్దునెమ్మోము నీ
రేలోలాయతలోచనంబులతెఱం ♦ గీచెక్కుటద్దాల మే
లీలీలాంఘ్రిసరోజకోమలతయు ♦ న్వీక్షించినంతన్మదిం
గాలాహిప్రతిమాన మానవునకుం ♦ గారుణ్యమింపొందదే॥

అక్కటా! తండ్రీ యెట్టిదుష్కృతమునకుఁ బాల్పడితివి! నీకీసుందరాంగుఁడేమి యపరాధము చేసె! నీయోజనలెల్లను వీనిపైని చూపవలసి వచ్చెనా!

కీర్తన. పీలు రాగము—అటతాళము.

హా! తండ్రీ యీ మోహనాంగుని జంపింప
నేతీరు మదిఁగల్గె నేమందునయ్యో
పాతకమునకైన భయమందకింతటి
ఘాతనెయొనరింపఁగా నీకు న్యాయమా॥ హా తండ్రీ॥
ఎన్నెన్నొ విద్యల నెఱిఁగిన ఫలమింత
కన్న నీకేమైనఁ గానఁగా రాదయ్యొ
అన్నా! నీకేమైన నపరాధమొనరింప
మన్నింపరాదెయీ మత్సరమేటికి ॥హా తండ్రీ॥

అయ్యో! యెట్టి పరుషోక్తి! నాకుఁ జదువుటకే జిహ్వ యాడకున్నది. నీకుఁ జేయెట్టు లాడెనో తెలియరాదు. వీనికి విషమిప్పించి మనయింటఁ జంపింపవలయును గాఁబోలు తండ్రి నీవు పురము వెడలుతఱి నేనెదురైన నీకేదేని శుభమొనఁగూర్చెదనని వాక్రుచ్చితిరి దానికిదియే తాత్పర్యము కాఁబోలు "వీనికిఁ [illegible]ణంబ విషమునిమ్ము" శివశివా యెంతమాట వ్రాసితివి! వీనిని జంపించిన ఫలదఁగాని మనకు శుభములొనఁగూడవా! వీనిమృతి జూచిన నేనా జీవించుట! వీనితో నేనును విషమే గ్రోలవలయు! జనకా రెండు చితులను పేర్పింపుమని వ్రాసి శుభము వీక్షింతువు రమ్ము! ఇఁక నేనేమి సేయవలయు! ఈ యుత్తరము ముద్రితంబగుటం జేసి విచ్చిచూడరాదను న్యాయంబున్నది [illegible]దయి కాఁబోలు నీసుజనుఁడిందుఁగల మర్మమెఱుంగకున్నవాఁడు ఇట్లైనదా ధర్మములకే లోనయి జగంబున నెందఱెందఱో పడరాని పాట్లఁబడిరి.

తే॥ గీ॥ సత్యమునకై హరిశ్చంద్రు • జనవిభుండు
ధర్మమును మీఱలేక నా • ధర్మజుండు
న్యాయమెడబాయక నలుం • డధిక బాధ
లెల్లఁబడిరిగదా మోస • మెఱుఁగలేక.

(ఆక్షేపము)

అయినను నేనిప్పుడు వీనిని మేలుకొల్పి యీ మోసంబును దెల్పిన నింతటనైన బ్రతుకఁగలఁడుకదా! వలదు వలదు. నాయీ వ్రతంబేమి కావలయు! నాయీ వ్రతంబెట్లున్నను ఇతండు నన్ను గారవింపకున్న నాకుఁ బ్రాణహానియు మానహానియును గలుగునుగదా! అట్లు చేయరాదు. నాకిక జన్మజన్మంబులను ఇ

ష్టిసౌందర్య లావణ్య వయోవిశారదుండు దొరకునా ! ఆకిసనితనినే పెండ్లి యాడవలయు. వీకిసనితనికడనే ప్రాణములు వీడవలయు. నిశ్చయము. నేనేవిద్యనేర్పరి నైతినేని నావిద్యాగురుండే ప్రజ్ఞావంతుండయ్యెనేని నాకీ యుత్తరము మూలముగనే శుభంబొనంగూడవలయును. తిరిగిదీనిని బరికించి యే దేని సవరణచేసి మగుడముద్రించి యెప్పటియట్లు పెట్టెదనేద దీనిచేనానాం ఛితమైనం దీరవలయు లేదేని యితనిప్రాణములైన దక్కను. (అని యుత్తర ము చూచి) యిందీ రెండుగురుక్తులుమాత్రమున్నవి. వానిని మార్చినచో లే ఖయెల్ల శుభార్థముతో నన్వయింపవచ్చును కాన నీరెండును మార్చెద. (అని దిద్ది యెప్పటియట్లు పెట్టి)

కీర్తన. పీలురాగము–ఆదితాళము.

ప్రాణనాథా । దీనురాల । పోయివచ్చెద ॥ప్రా॥
సరసుండనీ । చాననైతిం । గరుణం జూడుమా ॥ప్రా॥
మోహనాంగ నాపైంజాల । మోహముంచుమా॥ప్రా

మనోహరా! నెలవాసంగుము పోయివచ్చెద (అని మ్రొక్కి దోసిలొగ్గి పైనిచూచి) పరమేశ్వరా నీవేదిక్కు.

తోడిరాగము–రూపకము.

కరుణాకర గావవే యీవిభుని ॥కరు॥
కరుణమాలి తండ్రివీని । గరళమిచ్చి చంపవ్రాసె
పరమసాత్త్వికముననేమి । యెఱుంగక పపళించియుండెను॥కరు॥
దిక్కులేనివారికెల్ల । దిక్కునీవనుచునమ్మి
పెక్కురీతులను నీకు । మ్రొక్కెద నామొరగైకొని ॥కరు॥

తల్లీ! వనలక్ష్మీ! నీయనుగ్రహంబునం గదా నిట్టిమోహనాకారుని గనులారంగాంచుభాగ్యమైనం గల్గె! అట్టికరుణనే యింక నునుచి యీసరసుండు నామనోహరుండై మేమిర్వురమును నీయెడ విహరించునట్లు ప్రసాదింపుము.

సీ॥ జగములెల్లను జనిం ♦ పంగం బెంప ద్రుంపంగాంగర్తలై యొప్పుత్రి ♦ మూర్తులార
కాలమానంబులం ♦ గల్గించి పుడమికిసౌఖ్యంబునిడు సూర్య ♦ చంద్రులార
స్థిరతరరూపముల ♦ చెందిధర్మముబూని తనరెడుదేవవ ♦ తంసులార
దేవతాళికిం దృప్తి ♦ గావించుదూతలై ప్రాత్రతం గనువీతి ♦ హోత్రులార

తే॥ గీ॥ మీరునాయెడఁ గరుణించి ♦ మృతిఁ జెందుచు
మర్మ మెఱుఁగక పడియున్న ♦ నిన్ను లాఁగు
నితనివాత్సల్యమున శుభా ♦ న్వితుఁ జేసి
నాపతిఁ గూర్పఁ జేడియె దం ♦ దన మొనర్తు.

ఇకఁ బోయెద! ఇప్పటికే కాలంబతిక్రమించినది. అచ్చట చెలి యేమనుచుండెనో! కానిమ్ము నాభాగ్య మెట్లుండునో చూతము. (అని నిష్క్రమించుట)

గర్భసంధి సమాప్తి.

## చతుర్థరంగము.

(చెలికత్తెకడకు విషయా ప్రవేశము)

చెలి—(విషయనుజూచి అల్పకోపముతో) అమ్మా నీవెంతదానవు! నన్నిచ్చట నొంటిగా విడిచి దాహంబునకని పోయి యిప్పటికి వచ్చితివి. ఇచ్చటనేమైన నాకెవరుదిక్కు.

విష—ఏమే కోమలీ తామసంబునఁ బరుసంబులాడెదవు! కొలనికడకుఁ జని జలము గ్రోలి రావలదా! తడవైననేమి! నీదోహదంబు లయ్యెనా!

చెలి—దోహదంబులను గీహదంబులను నాదేవ్వైనవి. నీకై నిరీక్షించుచున్న దానను.

విష—(ఊరక చెలికై చూచుట)

చెలి—అమ్మా! నీమోముపై నేడేమియో క్రొత్తవన్నెలు కనుపట్టుచున్నవి. ఏ కేవంబులం జెప్పుము!

విష—నిదాఘంబునకు డస్సియుండి చల్లనినీరుద్రావుటం జేసి నీకుఁ గ్రొత్తవన్నెలు గనుపించెఁ గాబోలు.

చెలి—దాహముతీరిన వన్నె కాదు. వేరొండువిధముగాఁ దోఁచుచున్నది.

సీ॥ సఖియా నీకందోయి ♦ చందురుఁ గనివిచ్చు కలువపువ్వంబుల ♦ కరణి మెప్పె
అతివ నీ సొబగు మో ♦ మరుణు రాకకు మెచ్చు పుండరీకము రీతి ♦ బొసఁగియుండె
పెనగొనమ్రాఁకుల ♦ భించినతగుతీవ పగిది నీయొడలి ♦ సొగసుగల్గె
రాముని గనిపొంగు ♦ రత్నాకరము తేవ మదియుబ్బి కలెసంగు ♦ మాశ్కిఁ జోసె

తే॥ గీ॥ నీవిలాసంబు వీక్షింప ♦ నిక్కువముగ
క్రొత్తవింతలెన్నెన్నియో ♦ కొల్లలుగను

దోఁచెనీవాక మగవానిఁ ♦ జూచినట్లు
కారణము దెల్పవమ్మ బం ♦ గారుబొమ్మ.

విమ—ఏమే చెలీ! నన్నుఁగానక దుర్భాషలాడుచున్నావు మంచిదిరమ్ము జనకునకుం
జెప్పి శిక్షింపఁజేసెదను.

చెలి—తల్లీ! నేను దెలియక కోపగింబులాడితిని క్షమింపుము మనమిటకువచ్చి తడ
వైనది. ఇంకనింటికిఁ బోయెదమురమ్ము. (అని యిద్దఱు నిష్క్రమింతురు.)

## పంచమరంగము.

చంద్రహాసుఁడు (నిద్రలేచి.)

చంద్రి—ఇప్పు డెంతనిద్రపోతిని! నిద్రయెంతచెడ్డది!

ఉ॥ నిద్రయెకుంభకర్ణు నవ ♦ నింగడు మూఁడ్యుని గాఁగఁ జేసెనా
నిద్రయెతస్కరావళికి ♦ నిస్తులమైన శుభంబులిచ్చెనా
నిద్రదరిద్రదేవతకు ♦ నిశ్చలమౌ గృహసీమభూమిలో
నిద్రయెతన్నుఁబొందు నరు ♦ నిల మృతతుల్యుని గాఁగఁజేయదే.

అకటా! నిద్ర నన్నెంత మోసగించె తడవైనది మంత్రివల్లభుం డెంత యలుగునోక
దా! ఉత్తరము భద్రముగా నున్నదికదా! (అని కవచమునుండి చూచి)
కానిమ్ము ఏమి సేయుదము. ఇంతటు నైనసత్వరముగా బోయెదను. (అని
చనుట)

## షష్ఠరంగము.

(చంద్రహాసుఁడు కుంతలనగరసమీప ప్రవేశము)

చంద్రి—అద్దిరా! యిచ్చటనేమో కనులకు మిఱుమిట్లు గొలుపుచుఁ బ్రకాశించుచు
న్నది. పురసామీప్యమునకు వచ్చితిని ఇవి పురగోపుర శిఖరదీధితులు కాఁబోలు.

చ॥ కనకమయంబులౌ కలశ ♦ కాండము చండగతిన్ జ్వలింపఁగా
ననుపమరత్న సంఘటిత ♦ మైతొలిగుబ్బలిపైనిఁ గ్రాలు భా
నునిరుచిఁబోలిలోచన వి ♦ నోదముగొల్పుచుఁ గానుపించె ప
త్తనముఖ గోపురాగ్రమది ♦ తళుక్కుల బెళుక్కులగు లెక్కడుంజుమీ॥

ఇదియేయిట్లుండ నిఁక పురవైభవ మేమనవలయు! ఆహా! యేమియీ పురవీధులశృం
గారము!

ఉ॥ ఇచ్చటిసౌధవీథిఁగల ♦ యింద్రమణి ప్రతిభామరీచికల్
ఇచ్చటినూత్నరత్నవ ♦ హీరహిరణ్మయ తోరణంబులున్
ఇచ్చటిసర్వ హర్మ్యమాల ♦ నింపగు చిత్రములెల్లఁజూచినన్
మెచ్చులుగొల్పుచున్నవి సు ♦ మీ యసమానవిలాస సంపదల్॥

సీ॥ ఈపురంబునకు ధ ♦ నేశుఁడేలికయైన నలకాపురికి సరి ♦ యనఁగవచ్చు
ఈపురంబున సురల్ ♦ కాపురంబుండిన నమరావతికిఁదుల్య ♦ మనఁగవచ్చు
ఈపురంబగముపై నెసఁగినఁ గైలాస ♦ నగరంబుసాటియ ♦ నంగవచ్చు
ఈపురంబుదధిలో ♦ దీపించుచుండిన ద్వారకకైనయని ♦ తలఁపవచ్చు॥

తే॥ గీ॥ అహహాయిందలిశృంగార ♦ మహిమలెన్న
వశముగునె శేషునంతటి ♦ వానికైన
దీనిసౌఖ్యోన్నతులు మది ♦ దీరునట్లు
ననుభవించెడి వారిదే ♦ యనుభవంబు.

ఇట్టి మహాపట్టణంబున నామంత్రిసత్తముని గృహమును గనుఁగొనలేను గాఁబోలు. ఈవీథిని బోయెద. హజారమునందు భటులుందురుగదా! (కొంతదూర మేగి) ఇదియే మంత్రిగృహము కాఁబోలు. వీఁడే దండధరుండును గలఁడు. వీనినడిగి లోపలికిఁబోయెద.

(ద్యుతి)

దండధరా! మీజనకునియానతిచే, చంద్రహాసుండను రాజకుమారుఁడు మీదర్శనార్థమైవచ్చెనని మంత్రికుమారుండగు మదనునకు మనవిసేయుము.

దండ—చిత్తము! (అని లోపలికిఁబోయివచ్చి) అయ్యా మీరెవరో మీపేరు పూర్తిగాఁజెప్పి చెప్పకమున్నే లోపలికిఁదోడితెమ్మని యానతిచ్చె దయచేయుఁడు. (అని యిద్దఱును లోపలికిఁజనుట)

(మదనుఁడు చంద్రహాసుఁడు ప్రవేశము)

మద—స్వామీ! తావకపదాంబుజ రజఃపటలిచే నేఁదేశము సిరుల నలరారుచున్నది! ఏయేయక్షరములు తమదేహాంకితములై సార్థక పడుచున్నవి.

చంద్ర—అయ్యా! మీసామంత భృత్యనృపాలురలో నొక్కఁడును శాబరదేశపు పతియానగు కుళిందుని కుమారుండ. నాపేరు చంద్రహాసుండందురు. మదీయావాసంబగు చందనావతిపురినుండి మీజనకుం డుత్తరంబనుపఁ దెచ్చితిని ఇదే పుచ్చుకొనుఁడు. (అని చేతికిచ్చుట)

మద—(దోసిలితోపుచ్చుకొని కనులకద్దుకొని) భాగ్యము. విచ్చిచదివెదను (అని తనలో చదువుట) తనలో ఓహో యిదియేమి విశేషము! నాజనకుం డెంతటి బుద్ధికుశలుండు! వీనిబుద్ధికుశలతకుఁ దగినట్లే నేనును వానియభిప్రాయమును జక్కఁగా గ్రహించి కర్జము నెఱవేర్పవలయును. ఎట్టిచిత్రము "ఇతఁడు నిజముగానె" "జాతుఁడఁట" వీనికిని నాజనకునకు నెట్లు హితముచేకూరెనో తెలియరాదు. "వీనికిక్షణంబవిషయనిమ్ము" అని వ్రాసె నెంతమాత్రమును దడవుసేయరాదు. వీనివయోరూప కులశీలంబులు మిక్కిలి చొక్కంబులయినవి కాఁబోలు వీనికిబెండ్లియాని తెలిసిన నిష్టపడునో పడఁడో యను సంశయము చేతఁగాఁబోలు సీక్షణంబ అనియును వ్రాసి గోప్యముగా వీనికిఁ దెలియకుండ లిఖించి పంపె. మఱియుఁ దానిలువెడలునప్పుడు నా సోదరి యెదుర్కొని ముద్దుచూపఁ దానేదేని శుభంబొనగూర్తునని చెప్పె దానికిదియే నిదర్శనము కాఁబోలు వీనింగూర్చి యెట్టియోజనలును సేయవలదనియును వ్రాసె. ఇఁకఁదడవుసేయక కార్యప్రయత్నము చేయవలయును.

తే॥ గీ॥ అహాహ యెంతటిసౌభాగ్య ♦ మావహిల్లె
నిట్టిమంజులమూర్తియై ♦ నట్టియితఁడు
నాదుసోదరి విషయకు ♦ నాథుఁడైన
నలరఁదే పసిఁడికిఁదావి ♦ యబ్బినట్లు.

అయ్యా! చంద్రహాస మహీపాలా!

మత్తకోకిల.

తావకాగమనంబుచేతఁ గృ ♦ తార్థతను గన్నాఁడనీ
భావజాకృతిఁ గాంచితండ్రి కృ ♦ పం గుమారినొసంగఁగా
నీవుతెచ్చిన కమ్మలోపల ♦ నేలిఖించెను చూడుమా
భావమందున సంశయింపక ♦ బాలఁబెండిలియాడుమా॥

చంద్ర—అయ్యా! మీకు నాపై నంతటికరుణాతిశయముగల్గ నేనేలసంశయింపవలయు! మీయంతటివారి కన్యను బెండ్లియాడితినన్న నాకును మహోన్నతయశంబెకదా! కానిండు.

మద—తామంతిపురమునకుంజని కొంచెము విశ్రమింపుఁడు. (అని చంద్రహాసుని బంపుట) ఇఁకనేనును సత్వరంబున వివాహప్రయత్నము జేయింపవలయును. (అని చనుట)

## (ప్రకరి) సప్తమరంగము.

విభాకరశాస్త్రి మురారిరావు ప్రవేశము.

మురా—అయ్యా శాస్త్రిలుగారు పదివేల వందనములు. ఎక్కడనుంచియో వచ్చుచున్నారే!

విభా—ఛీ! భ్రష్టా నేను సన్యాసినా! నాకేలవందములనియెదవు! రెండువివాహములైగుంపెడుపిల్లలతో చల్లగానున్నవానిని పట్టుకొని యెంతమాట అంటివి.

మురా—నాకు తెలియదు యేమనవలెనో చెప్పండి!

విభా—మాబోటి పెద్దలను చూచినప్పుడెల్ల భక్తితో అయ్యా శాస్త్రిలవారు సాష్టాంగ నమస్కారములండీ అని మ్రొక్కవలె అంతట మేముదీవించెదము.

మురా—బుద్ధి బుద్ధి చెంపలువేసుకుంటాను లెండి (అని చెంపలకు చేతులానించి) మీరు పెద్దలు చదువుకొన్నవారు పిల్లలుగలవారు మీరొప్పచూస్తే నాకుచాలా జాలిగాను భీతి గాను ఉన్నది. నేను వైద్యుడను మందు యిత్తునా!

విభా—ఛీ! ఛీ! నాకేమివ్యాధిలేదు అవాచకములు పల్కెదావు కొంచెము భుక్తాయాసముగానున్నది.

మురా—మీకుయింత ఆయాసము కలిగేటంత పెట్టినవారెవరు! నాకు మొన్నటి నుంచి భుక్తిసున్నే.

(అపవాదము)

విభా—కుంతలనగరమున మంత్రియగు దుష్టబుద్ధిగారింట వారికుమార్తె పెండ్లియగుచున్నది నేడైదవరోజు నాకబలియగును నాకుయింటియొద్ద బాధ యెక్కువై ప్రాణములన్ని అక్కడనే పెట్టుకొని యింటికిపోవుచున్నాను ఆ పెండ్లి వైభవము చెప్పనలవికాదు సదస్యమురోజున వరహాలే సంభావనలు యిచ్చిరి మారకములేదు యిక భోజనమిట్టిదని నేను చెప్పజాల నాయాయాసమే సాక్షి.

మురా—స్వామీ! ఆహరిశ్చంద్రుడు నూరు అబద్ధములాడినను మీరొకటైన నిజము చెప్పరుగదా! మంత్రిగారింట లేనేలేరుకదా! వివాహ మెట్లయ్యె.

విభా—ఓరిశుంఠా నాపెత్తనమునైన గణింపక తూలనాడుచున్నావేమి!

(ద్రవము)

విభా—ఉన్నసంగతికి పెద్దయేమి చిన్నయేమి! అపభ్రంశమునకు సందఱు సెకటే! మనసంగతి తీసితే కంపు కంపు.

విభా—(తనలో) ఓహో వీడునావెంటపడ్డాడే (ప్రకాశముగా) నాయనా అట్లు కాదురా! ఏదో యుత్తరమువ్రాసి మంత్రిగారా పెండ్లికుమారునిచేతనే చందనావతిపురమునుంచి పంపిరట. ఆచిన్నవాడురాగానే సంగతులన్ని గ్రహించి తండ్రిలేకున్నను తగినకొడుకుగనుక నిముషములో ప్రతిష్ఠగా పెండ్లి చేస్తున్నాడు.

మురా—నేను మీతోవచ్చెదను వారింటికి తిరిగిపోయెదము. మీతోపాటు నాకును సంభావన నిప్పించెదరా!

విభా—(తనలో) దగ్గర చేరనిచ్చినందుకు నెత్తి కెక్కుచున్నాడే వీడికిని నాతోపాటు సంభావన కావలసివచ్చినదా! ఓరే నీకేటికిరా సంభావనలు అందులోమాతోపాటు కావలయునా! ఆత్మస్తుతిపరనిందయులేనిచదువుకొన్న పెద్దశాస్త్రులుగారిని నాకుసంభావనా మీసాలుపెట్టుకొని చుట్టపీకలు కాల్చుచు సంధ్యముక్కలైన రాని పరమశుంఠా గ్రెసరచక్రవర్తికినీకుసంభావనా!

మురా—సరేరా! నీఅంతు కనుక్కొనెదను వారియింట యింతకాలము చెడదిని మంత్రిగారినిన్ని వారికుమారుడు గారినిన్ని తిట్టినతిట్లన్నియూ నేను వ్రాసుకొన్నానులే యిదేచూడు నీపనిపట్టుతాను (అని పరుగెత్తుచుండ)

విభా—అరే అరే నాయనా! నన్నురక్షించుతండ్రీ నీపుణ్యాన యింతవరకు పిల్లలు నేను యేదోకాలక్షేపము చేసుకుంటున్నాము నేను యెరుగకపోయి నిన్ను అన్నాను నాకోంపతీయకు. నాకంటేనీకు యెక్కువగా సంభావనయిప్పించెదను. నాయనా నీకుకోపమురాకుంటే యొక్కటిచెప్పుతాను ఆమీసాలు ఉంటేనన్ను ఛీవాట్లుపెట్టుతారు గనుక అవి తగ్గించుతే బాగావుంటుంది వద్దువద్దు పోనీ ఉన్నునసరేలే నాతిప్పలు నేనుపడి నాకుయిచ్చినదైన నీకు యిస్తానురానాయనా!

(అని యిరువురు నిష్క్రమింతురు.)

## అష్టమరంగము.

(దుష్టబుద్ధి తనపురమునకువచ్చుట)

దుష్ట—(తనలో) ఇదియేమి ? మనపురమెల్లను మిగులచోద్యముగాఁగనుపట్టుచున్న ది ? పురద్వారమున నేదో పచ్చతోరణములు మెరయుచున్నవి యిదిగాక మంగళవాద్యములును మ్రోయుచున్నవి. కారణమేమి ? (యోచించి) నాసుతుడు చంద్రహాసునకు విషమునిచ్చి వాడుచచ్చినప్పిదప పురమలంకరించి యుత్సవము సేయుచుండెనాయేమి ! నేనట్లుసేయమని వ్రాసియుండలేదే అయినను వీనిపైననాకు గలిగిన యీర్ష్యను గ్రహించి కాఁబోలు నిట్లుత్సవముచేయుచున్నాఁడు. చంద్రహాసుఁడు మృతినొంది నేటికి నాలుగు దినములై యుండునుగాఁబోలు (యింటిముందుకువచ్చి)

ఓహో ! నేననుకొనుచున్నట్లులేదే ! పెండ్లివైఖరు లగుపడుచున్నవే !

శా॥ ఏమే మోవిపరీత కార్యములఁ జే ♦ యించెన్ మదీయాత్మజుం
డేమాయన్ బచరించుమన్న పనివాఁ ♦ డేమేమి గాఁజేసెనో
తా మోసంబునఁ జంద్రహాసుని మృతిన్ ♦ దప్పించెనోయేమొనా
నామాంగల్య విశేషకంబులిటు నం ♦ టన్ జూడఁ జోద్యంబగున్॥

ఎట్టి రాచకార్యములందును, ఆగతానాగతములను నిమిషములో గ్రహించెడి నాకీ యల్పవిషయమున సందేహము తగులుచుండెనే యేమి ! ఇంతయేల వాకిటిలోనికే వచ్చితిని అన్నియు ప్రత్యక్షమగును గదా ! (వాకిటిలోనికివచ్చి)

ఓరీ దండధరా ! యేమి విశేషములు !

దండ— మహాప్రభూ ! మహారాజా తమకుఁ దెలియని విశేషము లేమియున్నవి మీయాజ్ఞానుసారముగాఁ గుమారుఁడుగారు చేయుచున్న అమ్మాయిగారి పెండ్లికిది అయిదవరోజు.

దుష్ట—(పశ్చాత్తాపముతో) ఆ ఏమి ! (యోజించును.)

దండ—అయ్యా తమరంత వ్యవధానములేకుండ వ్రాసినను వారును మీవంటి బుద్ధిమంతులేకనుక మీయభిప్రాయము చక్కఁగాగ్రహించి నిమిషములో దబ్బునకు వెనుకముందాడక సర్వంబును సిద్ధపఱచి పెండ్లి చేయించుచున్నారు తమయనుగ్రహముచేత నెన్నఁడుఁను దినని భోజనాలును, ఎన్నడుకట్టనిబట్టలుమాకందఱికి అమరినవి చూడండి. ఒక్కఁడైన అటువంటివాడే యుండవలెను.

దుష్ట—(నిట్టూర్పులు విడుచుచు) ఓహో! యిదియా సమాచారము. నేను నమ్మలేకున్నాను. అయినను అంతఃపురమునకుఁబోయిన నన్నియుఁ దెలియును. (నిష్క్రమించును.)

## నవమరంగము.

(చంద్రహాసుఁడు కేళీకాగృహసమీపము.)

చంద్ర—ఇక్కడ మిక్కిలి చొక్కంబులగు చెక్కడపు మేడలు పెక్కులుగలవట. నేనుక్రమించక తిలకించి వచ్చెద. (ప్రవేశించి) నలుదెసలుచూచి ఆహా! యేమి యాశ్చర్యంగా నివిశేషములు కనులపండువుగావించుచు నితాంత సౌభాగ్య లతావితానంబుల కాలవాలంబై పెంపగుసొంపు సంపాదించుచున్నది.

ఉ॥ ఇది కేళీసదనంబ! కాదు ధనదున్ ◆ హింసించి దేవారి స
ద్మద మొప్పఁ గైకొన్న పుష్పకమె సు ◆ మ్మీ యట్లు కాకున్న నీ
పదియాఱ్వన్నె పసిండియుఁ విలువఁ జె ◆ ప్పఁ గా రాని రత్నావళుల్
గాదు వెంతేనియు లేక యిట్లలరునే ◆ కోటానకోట్లై భువిన్॥

ఇది కేవలము మానవనిర్మితము గాక దేవతాసృజనముగానున్నది లేకున్న నిట్టిమూల్య దివ్యరత్నమయంబై యుండునే!

సీ॥ ఇదికదా మదహార ◆ చంద్రవంశపయోధిసంప్రాప్తమౌక్తిక ◆ సంచయంబు
ఇదికదా దుర్వహా ◆ ర్యేశకోటీరాళి రాజితనవరత్న ◆ రాజరాజి
ఇదికదా లోకత్ర ◆ యీవిస్మయప్రదకుడ్య చిత్రితలతా ◆ కుసుమరాశి
ఇదికదా పంకేజ ◆ హితశశాంకకళాభి రమణీయదీపికా ◆ సముదయంబు॥

తే॥ గీ॥ ఇదికదా కల్మిచెలువకు ◆ సదనసీమ
యిట్టివైఖరులెందైనఁ ◆ బుట్టియున్నె
భళిరమంత్రికి యింతటి ◆ పదవిగల్గ
మనుజవిభుభాగ్య మింకనే ◆ మనఁగవచ్చు.

ఇంతియె కాక నలువంకల నమోఘములగు చిత్రపటంబులు గనుపట్టుచున్నవి (చూచుచు) ఇవి చిత్రపుత్రికావళులు కావు. ఛాయాయంత్రంబులం బట్టి వారివారి స్వస్వరూపంబు లెత్తిన ప్రతిమలుగాఁబోలు (యొకటిచేతఁదీసికొని) ఇతఁడు మదీయ ప్రియభావుకుండగు మదనుఁడా! ఔరా ప్రత్యక్షముగానున్నది.

క॥ మదనా రూపతిరస్కృత
మదనా శశికోటి సదృశ ♦ మంజులవదనా
సదమల సద్గుణసదనా
మదమున నిన్నిచటఁ గాంచు ♦ ము[illegible]

(మరియొకటిచూచి) వీరెవరు! యీశిల్పికారుఁడు రెండవ బ్రహ్మయే [illegible] ప్రమాదవశంబున జీవము పోయమఱచెను. కాని లేకున్న మఱియు [illegible] రాచరికముల నడుపనోపును.

ఆ॥ వె॥ ముందువచ్చు కార్య ♦ ములన్నిటిని[illegible]
రాచరికమునెల్ల ♦ శక్తిమీఱ
మనుపు మంత్రి సత్త ♦ మా మాను[illegible]
భక్తియుక్తిఁ జాలఁ ♦ బ్రణుతిసేతు.

(మఱియొకటిచూచి) ఏమినా ముద్దులాడి యిచ్చటనుండె! ఆరరే నాకెంత [illegible] భ్రమము కలిగె!

(విషయ మెల్లనవచ్చి వెనుక నిలిచియుండును.)

చం—
కం॥ వనజాసను గెలువనె నా
మనము భ్రమింపంగఁ జేయ ♦ మర్త్యుండెవనో
పనినేరుపు చూపనె యీ
కనకాంగినిదీర్చి చిత్ర ♦ కారుఁడు మున్నే.

కాకున్న చో స్వాభావికంబులగు సౌందర్యలావణ్యము లింతయైన [illegible] తగియుండును! దీనిని జూడఁ జూడ నాకు నొకభ్రమ [illegible] ది. నాకిలలోనే రెండవవిషయ సంభవమయ్యెనా ఏమి! [illegible]

తే॥ గీ॥ కొమ్మగాదిది బంగారు ♦ బొమ్మగాని
నారిగాదిది వేల్పు చి ♦ న్నారిగాని
యెన్నఁగా రానిచిన్నె ♦ [illegible]
మెఱయుచున్నది మదికినా ♦ [illegible]

విష—(సంతసమున చిఱునవ్వు నవ్వును.)
చం—ఏమి యీయంగ సౌష్టవము.

క॥ కరమా జలజము చామీ
కరమా మయిచాయ మోద ♦ కరమాకృతిశ్రీ
కరమా నేత్రాంచలము సు
కరమా యీ లేఖగుణ ని ♦ కర మారయఁగన్.

సీ॥ పరిపూర్ణకళలచే ♦ భాసురంబయినట్టి యీ మోముసొబగున ♦ కెద్దిసాటి
నూత్న యౌవనము క♦ న్నులపండువుగఁజూపు నీపూవచందోయి ♦ కెద్దిసాటి
రతనంపుసొమ్ముల ♦ రామణీయకమైన యీ ముద్దుకేల్గవ ♦ కెద్దిసాటి
కెంజిగుర్లనెసంగు ♦ కెంపుచాలఁబొసంగునీ కోమలాంఘ్రుల ♦ కెద్దిసాటి

తే॥ గీ॥ వేయుమాటలేల ♦ వెలఁదియంగకముల
సాటియైనవస్తు ♦ చయముగలదె
దానికదియె సాటి ♦ వసుధలో నీ మోహ
నాంగిసాటి విషయ ♦ యేరకంబె.

ఆకోమలాంగిని గూడి సరససల్లాపంబులాడు భాగ్యమింకను ప్రాప్తింపకున్నను నీ శిల్పకారుఁడు నామనోవాంఛ నీమూలమున నీడేర్చుకొనఁజేసె ఏమీ వీని పుణ్యము! ఎంతచిత్రము ఈప్రతిమయే రెండవవిషయయై నాతో ముచ్చటింపనిలిచెనా! యని యనిపించుచున్నది. అయినను పల్కరింతునా!

చ॥ తరుణిశిరోకంకణంబునకుఁ ♦ దళ్కొదవన్ మణిజేర్చినట్లుగా
సురుచిరమూర్తియైన నీజనకుఁ ♦ డుత్తరమొందు లిఖించిపంచి వ్య
త్కరమున నన్ను నీవిభుని ♦ గా నొనగూర్చె నాటగోలని
న్నరిశిగఁ బల్కరింప మన ♦ సయ్యె నొకింతముక ముచ్చటింపవే.

విష — వెనుకనిలుచుండి చిఱునవ్వుతో
(తనలో) ఆహా నేటికిఁగదా నామనోభీష్టంబు ఫలించె.
చంద్ర — (తనలో) ఓహో! ఈతరుణీమణి యెప్పుడువచ్చె! (ప్రకాశముగ) మనోహరీ నీవిక్కడవచ్చితివి!
విష — నాథా! తమరీ చిత్రగృహంబుల విహరించుచు చిత్రపటంబుల వర్ణింపుచుండఁ దిలకింపవచ్చితిని.
చంద్ర — మంచిది యింకఁగూర్చుండుము (విషయ కూర్చుండునట)

## రాగమాలిక.

తరుణీ—

సీ॥ నీతోడిసాటియెవ్వా ♦ నెలఁతగాఁగ నిదీని బల్కరించుచునుంటిఁ ♦ బల్లవోష్ఠి
ఆనందముప్పొంద ♦ నైదీని పొగడగెల్ల వర్ణించుచుంటినో ♦ వన్నెలాడి
అధికమావిస్మయం ♦ బారువన్నెలనెల్ల వీక్షింపుచుంటినో ♦ విహగయాన
కాంభోజునంతటి ♦ కుంభినీశునకైన నీసంపదల్ గల్గు ♦ నేలతాంగి॥
తే॥ గీ॥ శ్రీకనిలయంబులైనయీ ♦ చిత్రములను
భూరిగాత్రిరో కోరికల్ ♦ దీరఁగనుజూ
సురటి వీచులగతిని దే ♦ ~~బఱపననుచూ~~
నామెతలఁ దేలుచుంటినో ♦ కోమలాంగి.

ఏమి నా భాగ్యము !

సీ॥ నీమూలముననఁ గాదె ♦ నిర్మలహృదయుఁ డౌ మంత్రిసత్తముని జా ♦ మాతనౌట
నీమూలముననఁ గాదె ♦ నిస్తులమాణిక్య భూరిసౌధాళికి హరినౌట
నీమూలముననఁ గాదె ♦ భూమండలవ్యాప్త రామణీయ యశోవి ♦ రాజినౌట
నీమూలముననఁ గాదె ♦ నిరుపమానానేక రాజభోగములకు ♦ భాజనమగుట
తే॥ గీ॥ కలికినాయెడమీకెల్లఁ ♦ గల్గినట్టి
కరుణనే కాదె యీశుభో ♦ త్కరములకై
అవలమీపుణ్యమహిమనే ♦ మనఁగవచ్చు
వైభవనిధాన శ్రీవిష ♦ యాభిధాన.

విష — మనోనాయకా ! మీరిట్లేలఁ దలంచెదరు మీపైఁగరుణించ మేమెంతవారము ?

తే॥ గీ॥ సింధుసద్రంబులోని మా ♦ నికము నృపులు
చెట్టబట్టితెచ్చి యాదలఁ ♦ జేర్చికొందు
రతనమునఁగల్గు సుగుణవ ♦ త్త్వమునఁ గాక
కరుణచే గౌరవించుట ♦ కలదె భువిని.

కావున నన్నింటికిని దావకీయ సౌందర్యసౌశీల్యాది గుణగణంబె ప్రధానము జీవిత యనుగ్రహంబుననే మేమెల్లరమును కృతార్థులమైతిమి.

చంద్రి — ప్రేయసీ నీవిట్లుపల్క నేనేమనఁగలను ?

(దుష్టబుద్ధి ప్రవేశము)

దుష్ట— శా॥ ఓరీమందమతీ వివేకమనువ ♦ లొక్కింతయున్ లేక యు
త్సాహోపాయము లెల్లఁ బోనడచిదు ♦ శ్చారిత్రునిన్ నాకుమా
రీరత్నేశుని గాఁగఁ జేసి యుప కీ ♦ ర్తిన్ దెచ్చి యున్నట్టి
క్షీరాబ్ధిన్ విషముద్భవించినటులన్ ♦ జేసూరి తేఁ...

ఛీ! పందా నేనేమి వ్రాసితిని నీవేమి చేసితివి! నాయుపాయంబులన్నియు మంటఁగ లిపి యొక చెనఁటిమాయకు లోనై నాముద్దుకూఁతు నొక దురాత్ముండును దుర్మార్గుండును నగు వానికిచ్చి పెండ్లిచేసితివి ఛీ! నీముఖము చూడరా... యోజనావిషయంబున బృహస్పతియంతటివాఁడ నని ప్రసిద్ధిచెందిన నాకు ... తుఁడవై బుట్టి యిట్టియల్పకార్యంబున మోసపోతివి భ్రష్టా!

(నిరోధనము)

మద— అయ్యా! క్షమింపుఁడు క్షమింపుఁడు నామనవి చిత్తగింపుఁడు

తే॥ గీ॥ అయ్యా నాయెడదోసమా ♦ వంత యైన
లేదు తామంపినట్టి యీ ♦ లేఖనంబు
చదివెదనుదీనివృత్తాంత సార మెల్ల
విని పిదప నన్ను శిక్షింపుఁ ♦ డనఘచరిత.

కీర్తన. ఖరహరప్రియరాగము-ఆదితాళము.

తామసమేలానను ♦ దయఁజూడుచాలు॥ తా॥
తామంపినలేఖఁజూచి ♦ తదుపరిశిక్షింపనెప్పు॥ తా॥
ఈచంద్రహాసుఁడువచ్చు ♦ నిత్తఁడెట్టివాఁడో యనుచు
యోజనసేయకవిషయ ♦ నొసఁగుమంచువ్రాసితంపి
సూచనవేవేగఁదెలిపి ♦ సుతనువీనికొసఁగి పెండ్లి
యీచందమున నేఁజేసితి ♦ యింతెగాని దోసమెఱుఁగ॥ తా॥

దుష్ట— ఏమివ్రాసితిని! చదువుము (మదనుఁడు చదువును) అట్లు వ్రా... [illegible]
మ్ముచూచెదను (అని తీసుకొని చూచును)

(ఆశ్చర్యముతో)

ఉ॥ అద్దిర యెట్టిచిత్రమిది ♦ యాకుటిలుండు మదుమంగవ్రాయఁగా
బుద్ధిఁదలంచి వానికిటు ♦ ముద్దియ నిమ్మని వ్రాసినాఁడ నా
బుద్ధిబలంబు లూహలెటు ♦ బోయెను యాతని పాలిమృత్యు వే
గద్దరివీనిఁజంపఁ గొఱ ♦ గాదని యిట్లొనరించెనే యకో!

ఆహా! నేనెంతటి ప్రమాదమును జెందితిని! ఏదీ పొరపాటెట్లువచ్చినదో చూతము (అని చూచి) అకటా! యీరెండుచోట్ల పొరబడితినా! "నిజముగా సహితుఁడు" సాక్షు" అనుచోట నిజముగానైయాని నకారమునకెత్వమిచ్చితిని "విషము నిమ్ము" అను ముఖ్యపదముననే "విషయానిమ్ము" అని ముకారమునకు బదులు యాకారమును వ్రాసితిని ఇందువలన కార్యములన్నియు తలక్రిందులయ్యె. పాపము నాసుతుని వ్యర్థముగా చూఱతిని (నాయనా మదనా) నీవలన నిసుమంతయు దోసములేదు నీవుచేసినదంతయు శ్రేష్ఠతమమే నీవు! నగరునకునిజంరాచకార్యములఁదెలిగించుచుండుము) అనిన మదనుఁడుపోవును.

చ॥ ఓ గిరిసుతాంతపాతక ము ♦ పూర్ణనత కల్మషచంద్రహాసనీ
నేరుపు జూడఁజోద్యము ♦ నేనెటు పన్నినఁజావకుంటినా
కూరిమిపుత్రికన్ బతిగఁ ♦ గూర్చితి వెట్టిఁక వారనిస్సుని
పేరునఁబూచి యోరుతున ♦ త్రిప్పఁగఁజేసెదఁగాకదుర్మతి॥

చ॥ తాలుప్రియాన్ గతించితిఁగ ♦ దాయని నెమ్మది సంతసించి నీ
పాలకతల్లి తండ్రులను ♦ బందెలఁబెట్టి యిటేగుదేర నీ
గేలలు మేలుతైనరె ♦ లెస్సగటుతైనను వంటయింటికుం
దేలువిధానఁ జిక్కితివి ♦ నీవెటుపోవఁగలావు చూచెదన్॥

(వ్యవసాయము)

ఇంతయు నీపంద్రిపాసుండు మొంశివాఁడు మొంశివాఁడని విడుతునా! యెట్లయినవీని మృతినే కండ్లఁజూడవలయును ఏమిపన్నుదము (అని యోచించి) బలే మంచిదితోఁచినది ఇదిపన్నియంత్యమునకే తోఁచెనుగాఁబోలు. తప్పకచావవలసినదే. దీనినుచావఁజూ నేనైనను దలమోచుకొని చావవలసినదే యిదియే నా ప్రతిజ్ఞ నేఁడయిదవదినముకదా! మనయింట బెంగ్లికుమారుఁ డయిదవనాఁడూరుబైటఁ గల కాళిక సాయంత్రనంబున నొంటరిగా పూజాద్రవ్యములను, అఖండమును గైకొని పాదచారియైపోయి పూజించి వచ్చు నాచారము గలదని చెప్పిపంపి అంతకుమున్న నమ్మకముగు నిద్దఱు సూనరులను గుడియందు డాగియుంశి యొంటరిగా నెకఁడువచ్చును వానిని గుడిఁజొరఁగానే తత్క్షణంబన అక్కినాకావార్త తెలుపుఁడని చెప్పియేర్పాటుచేసెదను నేఁడే జరగవలయును వేళయగుచున్నది (అని నిష్క్రమించును)



శ్రీ

# శృంగార చంద్రహాసీయము.

## పంచమాంకము.

### ప్రథమరంగము.

(కుశికి పూజాద్రవ్యములు మోసికొనిపోవును)

చద్ర— కీర్తన

కాళికాంబ నన్నుఁగరుణ జూడవమ్మా॥కా॥
చాలాభక్తి నీదు చరణాంబుజముల ♦ మదినమ్మినానఁడ॥కాళి॥
పరమేశురాణి భక్తజనత్రాణి ♦ పరమకళ్యాణి శర్వాణి
అలినీలవేణి॥ కాళికాంబ॥

శా॥ అమ్మా నీదుతలంపుమాత్రనగదా ♦ యంభోజగర్భాది లో
కమ్ముల్ గల్గుటఁ బెంపునొందుటయుఁ బో ♦ కల్ గాంచుటల్ తావకీ
యమ్మౌసత్కరుణంగదా సుజనుల ♦ త్యామోదముల్ జెందుటల్
రమ్మా నాకభయప్రదాన మిడ ధా ♦ రమ్మౌ జగద్రక్షిణీ॥

క॥ కాళీకుంతల విజితవ
ర్గాళీరక్షోభయదశ ♦ రాళిశ్రితధీ
పాళీమునిహృత్సరసిజ
కాళీ నను గరుణమీఱ ♦ రక్షింపఁగదే.

క॥ అంబారక్షితభక్తక
దంబాకస్తూరికాక ♦ దంబాశ్రిత హే
రంబాలోచన జితరో
లంబానను బ్రోవగాఁజ ♦ లంబాజననీ.

మద— (కేకలువేయుచు) బావా చంద్రహాసా! బావా చంద్రహాసా! (అని తెలిసి
గుఱ్ఱముపైనెక్కి పరుగిడుచు కలియవచ్చును)

చంద్రి—ఏమీ యెవరో పిలుచుచు నన్నుకలియవచ్చుచున్నారు (అని నిలిచి తిరిగి చూచును) మదనుఁడా ఏమి ?మదనుఁడిట్లేలవచ్చెను ?

మద—

చ॥ నిలుపుము కాళికార్చనకు ♦ నేనిపుడేగెదఁ దెమ్ము వస్తువుల్
అలికులవేణిఁగూతు నచ ♦ లాధిపతిత్వము నీకొసంగఁగాం
తలునకనుగ్రహంబొదవెఁ ♦ దత్క్షణ మీ హయరాజమెక్కి భూ
తలపతిపాలికిం జను ము ♦ దారశుభంబిపు డావహిల్లెడున్॥

చంద్రి—బావా ! నీవధికమగు నాతురతచేఁ జేరమెత్తుచు నన్నుఁగలియవచ్చుచు ప్రేమాతిరేకముగ నేమోచెప్పితివి ! ఏమి ! కుంతలమహీపతి సుతయేడ ! పెండ్లియేడ ! రాజ్యాధిపత్యమేడ ! మీరుచెప్పినవి యసంభవవాక్యములుగా వినుపించినవి వానికర్థమేమి?

మద—అయ్యా ! మనకుంతల మహారాజేంద్రుండపుత్రకుండనియును నేకపుత్రికావంతుడనియును వేద్యమైయుండును తనకిప్పుడత్యల్పకాలమున మృత్యువాసన్నమగునని జ్యోతిష్కులుచెప్పనాతఁడు ప్రాయోపవిష్టుండు కానెంచి సుగుణగణ విశారదుండగువానికి తనరాజ్యంబొసఁగి కుమారియగు చంపకమాలిని నిడి పెండ్లిగావింప నుద్యమించి తగువాని నరసి తత్క్షణంబ తెమ్మనుటయు నందులకుఁదగినధీరుండవీవెయని ప్రభుసన్నిధిని నేనుమనవిచేసి నీవిపుడు కాళీకాపూజనమున కరుగుచుండుటఁ దెలిసికొని యొరులచే వర్తమానంబంపఁ దడవగునని యెంచి యీహయంబుపైఁ బైనంబై నేనేవచ్చితిని. కావున నిరుత్తరంబుగా నావిన్నపమాలించి యీయుత్తమాశ్వముపై నెక్కి నగరునకుంజనుము నీకుమారుగా నేనే గుడికిఁజని దేవీపూజనమాచరించి వచ్చెదను శీఘ్రంబునఁ దెమ్ము రయంబునఁబొమ్ము (అని పూజాద్రవ్యంబుల నెత్తిపైఁ బెట్టుకొనును)

చంద్రి—ఆశ్చర్యముతో ! బావా మహాప్రసాదము ! నేనేమియుఁజెప్పఁజాల ! నాకై యెంతశ్రమ వహించితివి (అని గుఱ్ఱముపైనెక్కి పోవును)

మద—(గుడికిబయలుదేరి తనలో) ఏమినాభాగ్యము !

(ప్రరోచనము)

తే॥ గీ॥ నామఱఁదిచక్రవర్తియై ♦ నాయనుంగు
చెల్లియలు పట్టమహిషియై ♦ చెలఁగుచుంట

వారికడ నేను మంత్రినై ♦ వరలుచుంటు
నాదుభాగ్యవిశేషంబ ♦ కాదె తలఁప.

నేను సత్వరంబపోయి కాళీపూజన మాచరించి మగుడపట్టాభిషేకోత్సవంబునకు పరు గునఁబోవలయు ఇస్సీ! ఆదేవికేవిధానంబునఁ బూజసేయవలయునో యె డుగనైతినిగదా కానిమ్ము శ్రీసూక్తంబు నభిషేచనముజేసి కరవ షో డశోపచారంబులఁ బూజింతెద. కొరవశినచో చంద్రహాసుండును నేనును వచ్చి యథాసావకాశముగాఁ బూజించెదము ఇఁక కాలక్షిద్యమానంబు లె ట్లుండునో చూతము.

సీ॥ రాజునైతినటంచు ♦ రాజసముగాని మన్నించునోయన్న మ ♦ న్నింపఁడే మొ
సిరివచ్చెనంచును ♦ చ్చికను బావాయని పిలుచునోయన్నట్లు ♦ పిలువఁడే మొ
దొరనైతినని నాదు ♦ తొంటిసపర్యలమఱచునోయవియెల్ల ♦ మరుపఁడే మొ
నాకుమున్నవశులెయోజ ♦ నలనుస్వతంత్రతనిచ్చునో లేకనా ♦ కీయఁడే మొ॥

తే॥ గీ॥ ఏదియెటులున్న నాతఁడ ♦ హీనగుణ
మందనుఁడువానికడనేను ♦ మంత్రినగుచు
నుండుటేచాలు వేనవే ♦ లూసఁగినట్లు
ఏమికొఱనాకు నిటుసంశ ♦ యింపనేల.

ఛీ! నాకేలయిట్టి దుస్సంశయముపుట్టె నామఱఁదియే చక్రవర్తియైయుండ నాకేమికా వలయు! దేవియాలయమింకను సమీపింపకున్నది కాల మతిక్రమించుచును గాఁబోలు

## కీర్తన. తోడిరాగము–రూపకము.

నేనెప్పుడేగెదనో నాపురికి॥ నేనె॥
మానవేంద్రుఁడాకులిందు ♦ సూనునిబట్టాభిషిక్తుఁ
బూనిసేయుత తికినేను ♦ బోఁగలనొలేనొయేమొ॥ నేనె॥
వేవేగమెగుడిక్కిఁజేరి ♦ దేవిపూజలెల్లఁజేసి
భూవిభునిపాలికేగి ♦ కేవిగానుమంత్రిత్వమొంద॥ నేనెప్పుడేగెదనో॥

ఇదె దేవతాలయ శిఖరము గనుపించుచున్నది గుడియు సమీపించినది.

క॥ దేవీమొక్కెద నేనిపు
డీవేదిక్కనుచునుంటి ♦ నీవేళశుభం

భావిస్ఫవింపఁజేయుము
పావనకరుణాప్రసార ♦ పాపవిదారా.

గుడిలోనికి ప్రదక్షిణపూర్వకముగ పోవలయు (అని ప్రదక్షిణముసేయఁబోవును)

సూన—(మెల్లనతమలో) అరే వచ్చుచున్నాఁడురో భద్రము కత్తిగిత్తి సవరించుకో గుర్తిస్తాఁడేమో సుమా! (అని దాగి సిద్ధముగా నుందురు.)

మద—(ప్రదక్షిణముసేయుచు)

కీర్తన. తోడిరాగము–ఆదితాళము.

ప్రోవవేశర్వాణి ♦ దేవీశిరోమణీ
భావజరిపురాణీ ♦ పరమకళ్యాణీ॥ ప్రోవ ॥
పావనగుణపాళీ ♦ కావఁగదే కాళీ
భావమునను నీను ♦ పదము లెన్నమ్మితి॥ ప్రోవవె ॥

(గుడిలోనికిపోఁగానే సూనరులు నఱకుట)
(హారహా రా అని పడిపోవుట)

విమర్శసంధి సమాప్తి.

## ద్వితీయరంగము.

(దుష్టబుద్ధి యేకాంతమున)

దుష్ట—(తనలో) ఏమీ! తలవరులింకను రారైరి! యిప్పటికాను రాత్రులఁ ముకు కిక్కిఁచేరఁడా కార్యమంతయుఁదీరియుండదా! గుడికిఁబోకనేతప్పించుకొనిపోయెనా! తిరిగిమరణవార్తఁ వినిపించియే పోయెదమనిరే యింతజాగేలచేసిరి నాతో జెప్పుట మఱచిరా! ఉదయమునఁ జెప్పఁగలమని యుపేక్షించిరా! నేనింత యాతురతతోనుండ వారిట్లుచేయనగునా! నేనేవారింద్రయిండ్లకుఁ బోయివత్తునా! (అనుచుండ)

సూన—ప్రవేశించి (దేవా దండములు) పనినెరవేర్చుకొనివచ్చితిమి మాపనియైనది యింకదేవరవారి దయయే రావలసియున్నది తక్కినసంగతులన్నియు రేపు మనవిచేసెదము ఇదిగోండి కత్తి, రక్తము.

దుష్ట—శబాసు మంచిది సంతోషము మీరుపోయి యుదయముననే రండు.

సూన—చిత్తము (అని పోవుట)

దుష్ట—ఓరీ చండాలా! యెంత కాలమునకు మృతుఁడైతివిరా? ఎంత కాలమునకు నా మనోభీష్టమీడేరె. రేపు ప్రాతఃకాలమున నేగుడికిబోయి వాని శవమును కన్నులార జూచి వచ్చెద. ఇప్పుడర్ధరాత్రి యైనట్లున్నది (అనుకొనుచుండ)

దండ—మహాప్రభూ! తమ అల్లుఁడుగారగు చంద్రహాసమహారాజుగారు మన చక్రవర్తిగారికూఁతును పెండ్లియాడి మన రాజ్యమునకుఁ బట్టాభిషిక్తుఁడై కేళులనూరేగుచువచ్చి మీదర్శనార్థమై భార్యాసహితముగా నిచ్చటికివచ్చుచున్నవాఁడు.

దుష్ట—(కోపము ఆశ్చర్యము చూపి) ఓరీ భ్రష్టా తారుమారుగా వాఁగుచున్నావు! చంద్రహాసుఁడా! చంద్రహాసుఁడా!

దండ—ఔనండీ చంద్రహాసుఁడే సందేహమేటికి! (అని తెలిసిమాటి, అడుగో) రానేవచ్చిరి.

దుష్ట—ఓహో! యిదేమిపిడుగువార్త!

చంద్ర—మామగారూ! నమస్కృతులు.

చంపకమాలిని—అయ్యా! జోహారులు.

దుష్ట—సుఖీభవ!

చంద్ర—అయ్యా! మీ యనుగ్రహంబునఁ గుంతలమహారాజ్యము కల్గఁజేసినందుకే కాక మూర్ధాభిషిక్తుండనై దేవరదర్శనార్థము యిందరమొకటి నేఁడిచ్చటికి యువచ్చెద.

దుష్ట—నా యనుగ్రహమేమి! పోయిరండు

(చంద్రహాసుఁడు చంపకమాలిని పోవుట)

దుష్ట—తనలో ఓరీ పాపాత్మా యెంతటికి కొంతకుండవురా! నా బుద్ధిబలంబెల్లను నీపాలే చేయవలసివచ్చెనుగదా! తిరిగి యిప్పుడేమియన్న బ్రతికితివి! యీపారి మృతి తప్పించుకొనుటయే కాక నిరపరాధియగు వానినెవనినో వంచించి పి నరహత్యయు మూటకట్టుకొంటివి నిన్నేమనవచ్చును! అకటా పాపము! వాని యాలుబిడ్డలెంత ఘోషించుచుందురోకదా! ఎవనిఁ జంపించియుండును! ఎవరినైన నేమి యీదురాత్ముఁడు జేసినపనికి ప్రాతఃకాలముననే గుడికిఁబోయి చూచివచ్చి పిదపవీనికై యేదోవన్నెయు గొంచెము కరుండెడు రాత్రిమించుచున్నది (అని నిష్క్రమించుట)

తండ్రీ! నీకై యెన్నెన్నియో వ్రతోపవాసాదులు సల్పి యెన్నియో దేవతాప్రార్థనలు చేసి నిన్నొక కనకపుగట్టువలె గాంచి నీకొఱకెంతో మురియుచున్న మాకుఁగూఁదకే పాటు వాటిల్లఁజేసితివిగదా!

శా॥ అన్నా నిన్నని పెంచియుత్తియువవీ ♦ తాన్వీతుఁ గాంచించి నా
న్నెన్నెన్నో విద్యలునేరిపించి నిను భూ ♦ మీశోత్తముఁ జేసె...
మన్నీలందఱు నీకుమ్రొక్కఁగను ద్రే ♦ మంబూని సేయుండఁగా
నన్నీరీతిఁ గృశింపఁజేసితి గదా ♦ నాభాగ్య మిట్లయ్యెరా!

సీ॥ ఈ రాజసుతను నీ ♦ కిచ్చి పెండ్లి గావించి చూచుభాగ్యము నాకు ♦ లేకనాయె
నినుఁబట్టభద్రుగా ♦ నొనరించికనులారఁ జూచుభాగ్యము నాకు ♦ లేకనాయె
సామంతులెల్లహే ♦ చ్చరికలనిను మ్రొక్కఁ జూచుభాగ్యము నాకు ♦ లేకనాయె
నీవుపుత్రయుతుండ ♦ వై వెలయఁగఁగండ్లఁ జూచుభాగ్యము నాకు ♦ లేకనాయె

తే॥ గీ॥ అక్కటా మందభాగ్యుండ ♦ నైననాకు
బట్టివైనన్ను నిక్కట్ల ♦ పాలుచేసి
మురిపెములు నేటితోడనే ♦ ముగిసిపోవ
నిట్లు కాల్చిత్తె బలిమృతి ♦ వేసమార.

నాయనా! నీకోమలశరీరంబును నేట్టిదుర్దశయందుండఁ జూడవలసివచ్చె. నాప్రేవులు తరుగుకొనిపోవుచున్నవిగదా! అయ్యో! దుఃఖముప్పొంగుచున్నది.

సీ॥ పూబాన్పులనులోప ♦ ములనెన్నువాఁడవు వీరాలనెట్లువరుంటివి ♦ రాకమార
గోటిగిత కెయ్యోడ్వఁ ♦ గొరగానివాఁడవు కోతలకెట్లోర్చి ♦ తో తనూజ
నగరులందెచరింపఁ ♦ జెగడొందువాఁడవు వకనింతదవ్వెట్లు ♦ వచ్చితయ్య

తే॥ గీ॥ అయ్యయో యేమెఱుంగని ♦ యర్భకుఁడవు
నీవుక్రూరులపాలైతి ♦ వేమనందు
వసుధనేరినిగన్నిమెచ్చ ♦ వాఁడనింక
దిక్కు నాకెవ్వరయ్యా నా ♦ చక్కనయ్య.

శా॥ ఏరాపిల్చినఁ బల్కవేల దయలే ♦ దేనీకు నామీఁద నీ
మారామా! జనకుండవచ్చితిని స ♦ న్మానింపరానా కనా
ధారం బెవ్వరో చూపితయినఁ జనరా ♦ దౌర్భాగ్యుఁ డన్నన్ని నీ
వీరీతి న్విడనాడి పోఁగఁజనునే ♦ నేనెట్లు జీవింతురా!

ముద్దుకుమారా! నీమోహనాకారము కనులారఁ జూచుభాగ్యము నేటితోఁ గదా తీరె
ను. తనయా! నినుఁ జూడఁ జూడ నామనము దఱికొనుచున్నది.

సీ॥ అమృతంపుసోనలిం ♦ పలరారఁ గాఁ బల్కు సదములవదనమా ♦ యిదికుమార
రత్నకంకణముల ♦ నవళి చేవిలసిల్లు ముంజేతులివి ♦ ముద్దువట్టి
క్రొంబట్టుపట్టముల్ ♦ గుఱుగాధరియించు మృదులశరీరమా ♦ యిదిసుపుత్ర
నిండుప్రాయము కను ♦ పండువుగాఁ జూపు సొగసుమీసలయివి ♦ రంగనేత్ర॥

తే॥ గీ॥ గాలఁబడి పొరలాడుచు ♦ జాలిదూలి
నీనాగరికతయెల్ల ♦ నేలఁ గలియ
నెత్తుటను మున్గియున్న నీ ♦ యుత్తమాంగ
మేనెటులఁ జూచి యోర్తునో ♦ యాత్మజాత.

అక్కటా! సుకుమారా! మదనా! చంద్రవదనా! నాచిన్నారిపట్టీ! నన్ను దవ్వు
దవ్వులనె కాంచి మన్ననలఁ జూపుచు నెనరొప్పఁగువే నేఁడేల నేనిట్లు మొర
పెట్ట నామొఱాలింపవు బాలకా వేదనవారకైన పెన్నిధివలె నీవుకలుగ నఱ
చేతిలో నిడికొని ప్రాణపదంబుగాఁ బెంచిపెంచి నేఁడీదురాత్ముండగు చం
ద్రహాసున కర్పింపవలసెఁగదా! నీముద్దుమాటలు మాటిమాటికిని నెరాటఁబల్కి
నట్లు చెవులకు తట్టుచున్నవి పుత్రా! నీరాచకార్యములును నీధర్మప్రచారము
లును నీవిద్యలును ఏమిచేసి చనుదెంచితివి తండ్రీ అయ్యో! నీమోహనమృ
దుల శరీరంబున కెట్టిపాటు ప్రాపించె!

సీ॥ ఆకిరాతకులుని ♦ న్నరికట్టువేళనీ యుల్లమం దెంతభీ ♦ తిల్లినావొ
కఱకుకత్తులనునీ ♦ కంఠంబుఁ దఱుగుచో నెంతెంత పరితపి ♦ యించినావొ
త్రాణమెల్లను బాసి ♦ ప్రాణముల్ బోవుచో నేమని నన్నెంచి ♦ యేడ్చినావొ
ఆకస్మికప్రమృతి ♦ యారుదేరమమ్మెల్లఁ బాయఁజాలక యెంత ♦ వగచినావొ॥

తే॥ గీ॥ బాలకా నన్నునిక్కట్ల ♦ పాలుజేసి
యెల్లసిల్లెడు నీసిరు ♦ లెల్లఁ బాసి
యిచటఁ బెనునిద్ర పోవుచుం ♦ టేమనందు
మారసుకుమార ముద్దుకు ♦ మార ధీర.

నాబుద్ధిబలంబును నాయుదారసాహసంబును నాయశోవిశేషంబును నాప్రజ్ఞాతిశయం
బును నీకొఱకుఁగాక మఱియెవరినుద్ధరించుటకు పుత్రా! ఛీ! నేనెంతనిర్భా

ష్యుండను ఇంత బ్రతుకు బ్రతికి తుదకు ప్రతిజ్ఞాభంగము నొందవలనె ప్రతి
జ్ఞాభంగమునకన్న ప్రాణభంగమే మేలుకదా! నాజన్మమేలగాల్పనే నాకొక
కొండవలె నండగానుండఁజూచుకొన్న నీవుండని యీ యఖండ మహీమండ
ల సామ్రాజ్యమేల! నామంత్రిపదంబేల! నేనింక నెవరికొఱకు నపాయముల
బన్నుసును! నేను బ్రతికియుండి యేమిసేయవలయు ఆకురాత్మునికను మంత్రిత్వము
వహింపవలయుఁగాఁబోలు! నాచేతనైనంతదాకఁ జూచితిని. కానిమ్ము యీ
రాజ్యమ్మును నీజన్మమ్మును జూసినే రామరాజ్యముగ నేలిమ్ము ఇట్టి కట్టిదం
బులంబకై జీవించినను వానికిదయంతయు గ్రహించిన నన్ను బలాత్కారము
గనైనఁ జంపఁజూచును చంకకుఁ దనిచాపిన నిసివలె పుత్రహీనుండనై జీవిం
చుటకన్న మిన్నయగు వీనితెన్నదోట్రిక్రియ మృతుండనైతినేని నాయర్ధాంగి
యు సహగమనక్రియతో నన్నుఁ గలియును. మేము మగ్గురమును దగ్గరజేరి
యుండగలము. ఛీ! యీ ప్రతిజ్ఞాభంగము నొంది యేల జీవింపవలయు? ఛీ కా
ళీ! నీముఖముఁ జూడరాదు. నీవుండియే యిట్టి ఘోరకృత్యముఁ జేయుచుం
డఁ గనుచుంటివిగదా! యిట్టి కాతురాలవగు నిన్నుఁ జూచి యోర్వఁజాల
నేమను నీశిలా స్తంభమునకుఁ దలమోదుకొని చచ్చెద (అని తలకొట్టు
కొని చచ్చుట)

## చతుర్ధరంగము.

(చంద్రహాసుఁడు గుడికి కత్తిచేఁబూని వెడలి)

చంద్రి —

మ॥ అకటా యెంతటివార్తఁ వింటి విమల ♦ స్వాంతుండు నామామయా
త్యకలంకాత్ముఁడు నామఱందియును శ ♦ క్త్యాగారమందోఁటిగా
వికలాంగంబులఁ ద్రెళ్ళియుండిరఁట యీ ♦ వృత్తాంతమున్ విన్నఁ గ
ర్ణకఠోరంబుగనుండె నేనటకుఁ జే ♦ రంబోయి వీక్షించెదన్॥

కటకటా! యీపిడుగువార్త వినినప్పటినుండియు నాయుల్లము తల్లడిల్లుచున్నది
త్వరితంబుగాఁ బోవలయు (అని పోవుట)

(గుడికిఁబోయి) ఆశ్చర్యముతో! అన్నా యెంతటి ఘోరకృత్యము. ఇంతటి యఘక్ర
తి యెట్లుజరిగియుండును?

ను ఏలచేసికొనవలయును! ఇట్లు చింతిల్లుట ధీరోదాత్త లక్షణము కాదు. ఎంతయును ధైర్యమవలంబింపవలయును. వీరిని బ్రతికింపనుపాయ మరసెదను. నేనీ కాళి నుపాసించి ప్రత్యక్షపఱచుకొని తదనుగ్రహంబున బున్నర్జీవితులం జేయవలయును. (అని కాళిని చూచి మ్రొక్కి) హాదేవీ! దివ్యప్రభావా నేనే నీతిమంతుఁ డనైతి నేని నేను సుక్షత్రియకులజుండ నైతి నేని కరుణించి నాయుద్యమము నెరవేర్పుము ఇదే చని పంచాగ్నుల మధ్యంబునఁ దపంబాచరించెద. (అనిపోవుట)

(తిరిగి శవములకడకువచ్చి)

క॥ ఇది కాళికా ప్రసాదము
ముదమారఁగ వీరివక్త్రములనిడ నిద్రన్
వదలినకరణిని దొలికళ
లాదవఁగ లేతురని శక్తి యొసఁగునుదీనిన్.

ఈదేవీప్రసాదమున వీరు బ్రతుకుదురు గాక (అని ప్రసాదము వక్త్రములందునుంచ నిరువురును లేచుట)

దుష్ట—ఆహా యెంతటినిద్రపోయితిమి మేల్కొంటిని (అని చంద్రహాసునిఁ జూచి) ఈ మహానీయునా! నాదురాలోచన లెల్లను ప్రయోగించి చంపఁజూచితిని. ఛీ నేనంతటి పాపిని! ఇప్పుడీ పుణ్యుని చేత నేకదా మేమిరువురును బ్రతికితిమి. మాకిచ్చుట నితఁడు గాక మఱిదెవ్వరు! అట్టి యీ పుణ్యునికి నేఁ జేసిన యపకృతికి నాకుఁ దగిన శిక్షయె ప్రాప్తించె. నాజన్మము కాల్పనా! వీని ముఖము చూడఁజాల. అని తలవంచుకొని యొకచో నిలుచుండుట.

మద—బావా చంద్రహాసా! రాజపుత్రిని బరిణయంబై మూర్ధాభిషిక్తులైతిరా!

చంద్ర—నాయనా యేమని చెప్పుదును!

చంద్రి—మామగారూ నమస్కరించెదను.

దుష్ట— ఆ॥ వె॥ మామగాఁ డితండు మర్యాదహీనుండు
దుర్మదాంధుఁ డార్య దూషకుండు
కుటిలవర్తనుండు క్రూరుండు మూఢుండు
దుష్టబుద్ధివీఁడు దుండగీఁడు.

# శ్రీ శృంగారచం॥

అనంతకోటి పాపములకాస్పదుండనగు నన్ను "మాపు
దయఁ జెడునేమొకదా! నేనొక మహాపరాధిని క్షమింపుము."

చంద్రి—అయ్యా! యిట్లేల బెట్టిదము లాకొనియెదరు!

గష్ట—నాయనా నీవు సుగుణగరిష్ఠుండవు, దైవబల సమన్వితుండవు, నగుటంజేసి నీమహిమచే మమ్ముఁ బునర్జీవితులఁజేసితివి. నేనీకొనరించిన యపకృతికి నాకీయుపకారమనర్హము నాకీమరణమే సరియైన శిక్షణము ఎట్లనిన.

సీ॥ నిను బాల్యమునఁబట్టి ♦ వనములోనరకింపనెంచి క్రూరులకుఁబ ♦ ట్టించినాఁడ
నీకు విషంబిచ్చి ♦ నీల్గింపఁగా వ్రాసి నిను నాకొడుకుచేంత ♦ కనిచినాఁడ
కాళీ ప్రజనమని ♦ కల్పించి నినుఁబంచి యీ యెడసుతునిగో ♦ ల్పోయినాఁడ
నంతనైనగ్రహింప ♦ కన్యాయముగనిన్ను బిట్టుగా నెన్నియో ♦ తిట్టినాఁడ

తే॥ గీ॥ అయ్యా! నినుఁజంపనేఁజేసి ♦ నట్టిపనులు
తప్పిపోయెను ఎన్నియో ♦ చెప్పఁజాల
నింతటిదురాత్ముఁడనుగాన ♦ నిటులఁజచ్చి
నేడునీకృపజీవించి ♦ నిలిచినాఁడ.

ఇంతయేకాక తొలుదొల్త మదనునకుత్తరంబు నీచేఁబనిచి సధర్ములగు నీతలిదండ్రులను బలాత్కారమునఁ జెఱఁబెట్టించి వారియిష్టసంపదలెల్లఁ జూరగొని వచ్చినాఁడ. ఇట్టిపాపాత్ముఁడను కావుననే యిట్లనుభవించితిని తలయెత్తి నిన్ను వీక్షింపఁజాలకున్నాఁడ. ఇంతకును కారణంబేమన! నేనొకనాడు నాయింట జ్యోతిష్కులతో ముచ్చటించుచుండ నీవటకు బంతికై వచ్చితివి. వారు నిన్నుఁగాంచి సాముద్రికలక్షణంబులం బట్టి నీవీదేశంబునకుఁ జక్రవర్తి వగుదువని చెప్పిరి. నేనంతకుమున్న నాకొమరునకు రాజకుమార్తెను బెండ్లిచేసి రాజ్యాధిపత్యమియ్య నుద్యమించితిని. అట్టియుద్యమమునకు భంగంబగునని నిన్నుఁజంపింప నాచేతనగునంతటివఱకును యత్నించితిని. తుదకిట్టులయ్యె. నావర్తనంబులన్నియు నిట్లుండఁగాన

వృత్తమాలిక.

గష్ట చంద్రి హాసునితో } అయ్యనీకపరాధీనగు దురా ♦ త్మ్ముఁడను నను గావుమా।
యియ్యెడను నానేరముల శమి ♦ యించి నన్ను క్షమింపుమా।

చంద్ర దుష్టతో } అయ్యయోపసిబాలునన్నిటు ♦ లాడనేటికి ధీమణీ।
నెయ్యమునదీవనలతోఁ గరు ♦ ణింపవే సచివాగ్రణీ।

(ప్రసాదము)

(సనత్కు) ఆహా! యేమి నా భాగ్యము. నేటికిఁగదా నాదు మనోభీష్టంబులు పండె. మహామహులుండెడు నాయనుంగుటల్లుండగు నగు చంద్రహాస రాజేంద్రుని పట్టాభిషేకోత్సవము కనులారఁగాంచితిని. చాలు.

(సముదయము)

తే॥ గీ॥ లోకములకెల్ల వరిపాకమయ్యె
కువలయానందరసమొన గూర్చియుండె
సత్ప్రచారంబులెల్లెడ జరుగుచుండె
చంద్రహాసుండు రారాజ చంద్రుఁడౌట.

(ఆనందము)

చంద్రహాస మహీపాలా! నీవు కరుణించి నామనవి నంగీకరించుటచే నాదు మనోభీష్టంబులు ఫలింప తావక పట్టాభిషేకోత్సవమును గనులారఁగాంచి ధన్యుండనైతి. నీవఖిలజ్ఞుండవయినను నీయెడ నాకుఁగల విశ్వాసముచే నాకనుభవ సిద్ధమగు నొక్క వాక్యము వక్కాణించుటకు సెలవొసంగుము.

చంద్ర—దేవరకృపకుఁ బాత్రుండనుగదా!

సుష్ట—

సీ॥ పరుల వైభవములఁ బండు వెన్నెలలట్లు చల్లఁగఁ గని యుల్లసిల్లవలయు
పరుల యదృష్టసంపదలసంద్రము మాడ్కిఁ గనులారఁగని మెచ్చుకొనఁగవలయు
పరుల సత్కీర్తిని హరిపురాణములీలఁ గొల్లగ విని యూరడిల్లవలయు
పరులయే వనరూప భాగ్యంబు మేరువు చందానఁగని మోదమందవలయు.

తే॥ గీ॥ పరుల సౌఖ్యోన్నతులనింటి పండువులుగ
పరుల కష్టంబులను దన బాధలట్లు
నరయుచుండంగఁదగుసుమీ నరవరుండు
నమ్ముమిది యనుభవవచనమ్ములనఘ.

సీ॥ కొంగునముడివేసి కొనిదాచుకొన్నట్టి
యురుతరాగ్నియెసుమీ యోర్వలేమి।
కడిమిఁ గైకొనికుత్తుకకుఁ జుట్టుకొన్నట్టి
యుగ్రసర్పమెసుమీ యోర్వలేమి।

పొదలనుంచినదాని ♦ బురికొల్పకొనఁ
బైకిఁబర్వు సింగ మెసుమీ ♦ యోర్వలేని ।
చేచేతఁగొని వేడ్క ♦ చేభుజించినయట్టి
యమృత్తయేసుమీ ♦ యోర్వలేని ॥

తే॥ గీ॥ అట్టి యోర్వలేమిఁజే ♦ పట్టినిన్నుఁ
జెలువఁగానెంచి నేనీట్లు ♦ చేసితిసుమ్ము
తానసేరికినట్టి ని ♦ తాగగుణము
లుండఁగారాదు వినుముమా ♦ ర్తాండతేజ.

మహాప్రభూ ! నేనుమనవిసేయు విషయంబులెవ్వియును లేవు. ఇతండు మదీయసూను
జుండు. మదనుండు అర్భకుండు వీనిని నియమంబుగాను వీరిరువురు నీ ప్ర
ముశిమానినులు. వీరిని పట్టమహిషులుగాను కరుణచే సంగీకరించి యాచం
ద్రతారకంబుగాఁబ్రజాపరిపాలనంబు చేయుము. నాకును నిహసౌఖ్యంబు
లన్నియుఁదీరె నింకవనంబునకుం జని తపంబాచరించెద. సెలవొసంగుము.

చంద్రహాసుండు
మదనుండు
విషయ
చంపకమాలిని

(అందఱు పీఠములుదిగి)
అనుగ్రహముంచవలయు. ఇవియేపదివేలవందనములు.

నిర్వహణసంధి సమాప్తము.

(భరతవాక్యము)

ఆ॥ వె॥ కాలమునకు మేఘ ♦ జాలంబువర్షించి
పంటలెల్లఁబండి ♦ ప్రజలకెల్లదు
నఖిలసుఖములబ్బి ♦ హరికృపాసాంద్రంబు
కలజగంబులెల్ల ♦ వెలయుఁగాత.

గద్య.

సీ॥ మానుమత్కటాక్షసం ♦ ప్రాప్తకవిత్వ సంపన్నుఁడు [illegible] ♦ [illegible]
కౌండిన్యమునిగోత్ర ♦ జుండు [illegible] యశాస్త్రి [illegible] ♦ [illegible]
యాసుతుండు॥ వేంకటసుబ్బయా ♦ ఖిఖ్యాత [illegible]
దాంభోజసే ♦ వాపరుండు॥ [illegible] ♦ [illegible]
త్వాను జన్ముఁడు శ్రీకొండ [illegible] ॥

# పంచమాంకము.

తే॥ గీ॥ పండితవిధేయుఁడగు గురు ♦ బ్రహ్మశర్మ
కృతి నిశృంగార చంద్రికా ♦ సీయమనెడి
నాటకముఁ గూర్చి హరికర్ప ♦ ణంబొనర్చె
మిగులనాచంద్రతారార్క ♦ మగుచు వెలయ.

స్వస్త్యస్తు.

---

